*Issued on 10-9-1958*



Volume XVI

No. 2

3rd July, 1958
(Thursday)

# Andhra Pradesh Legislative Assembly Debates

## Part II — Proceedings other than Questions and Answers

## OFFICIAL REPORT

---

CONTENTS



NOTE: *at the commencement of the speech denotes confirmation from the Member not received in time.

Printed by Ajanta Printers, Secunderabad,
for the Director, Government Printing Press, Hyderabad-A. P.

THE

# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

*[Part II — Proceedings other than Questions and Answers]*

OFFICIAL REPORT

---

*Sixty-third day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Thursday, the 3rd July*, 1958

The House met at Half Past Eight of the Clock

[MR. SPEAKER IN THE CHAIR]

## QUESTIONS AND ANSWERS

(SEE PART I)

## BUSINESS OF THE HOUSE

శ్రీ వి. విశ్వేశ్వరరావు (మైలవరం): Point of information, Sir. రూలు 74 క్రింద నేను 27 వ తారీఖున ఒక తీర్మానం ఇచ్చినాను. ఇంతవరకు రాలేదు. అది చాలా ముఖ్యమైనది కాబట్టి సమావేశం పూర్తి అయే లోపులో వచ్చేటట్లు చూస్తారా ?

*Mr. Speaker :* I shall try.

శ్రీ జి. ఎల్లమందారెడ్డి (కనిగిరి) : నాగార్జున ప్రాజెక్టుకు సంబంధించి నేను ఒక ప్రతిపాదన ఇచ్చినాను. అదికూడా చాలా ముఖ్యమైన విషయం.

మిస్టర్ స్పీకర్ : కనుక్కొని వీలైనంత త్వరగా వచ్చేటట్లు చూస్తాను.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ) : నిన్న రూలు 70 క్రింద నందిగామ స్కూలును గురించి ప్రతిపాదన ఇచ్చాను. ఈరోజు చెప్పిస్తారా ?

మిస్టర్ స్పీకర్ : రేపు చెప్పిస్తాము.

విద్యామంత్రి (శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు): తారీఖులు కూడా మరచిపోతున్నారు. వెంకటేశ్వర్లుగారు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు : రోజులు గడచినకొద్దీ అక్కడ విద్యార్థులకు సీట్లు దొరకవు.

## THE OSMANIA UNIVERSITY BILL, 1958
## THE ANDHRA UNIVERSITY (ANDHRA PRADESH AMENDMENT) BILL, 1958
## SRI VENKATESWARA UNIVERSITY (ANDHRA PRADESH AMENDMENT) BILL, 1958

* శ్రీ ఎమ్. చెన్నారెడ్డి (వికారాబాద్-జనరల్) : అధ్యక్షా, మన రాష్ట్రంలోని మూడు విశ్వవిద్యాలయాలకు సంబంధించి ఒకేసారి బిల్లులను ప్రవేశపెట్టడం చాలా ఆశ్చర్యకరమైన పరిస్థితులలో జరిగింది. ఉస్మానియా విశ్వవిద్యాలయం స్థాపింపబడి అనేక సంవత్సరాలైనది. ప్రాంతీయ భాషలలో ఒకటి అయిన ఉరుదూలో విద్యావిధానమును నడిపించుటలో చక్కటి అనుభవమును సంపాదించినది. ప్రాంతీయ భాషలలో విశ్వవిద్యాలయ విద్యావిధానమును ఏ విధంగా ఏర్పాటు చేసుకోగలుగుతాము అనే సందర్భములో అనేక విషయములను తెలుసుకొనుటకు వీలును కలిగించిన విశ్వవిద్యాలయముగా పేరుపొందినది. అయితే ఎప్పటికప్పుడు ఏదో ఒక దురదృష్టం ఈ విశ్వవిద్యాలయాన్ని వెంటాడుతున్నట్లే అనిపిస్తోంది. వెనుకటి నైజాం ప్రభుత్వం ఉన్న రోజులలో సరియైన మార్పులు తీసుకురావాలని అనుకున్నా ప్రయోజనం లేకపోయింది. స్వాతంత్ర్యంవచ్చిన తరువాత, పోలీసుచర్య జరిగిన తరువాతకూడా హైదరాబాదు ప్రభుత్వం విశ్వవిద్యాలయం విషయమై మార్పులు చేయాలని ఆలోచనలు చేయబడ్డవి. కాని దురదృష్టవశాత్తు అప్పుడుకూడా అనేక ఆటంకాలు కలుగుతూ వచ్చాయి. ఈ విశ్వవిద్యాలయాన్ని కేంద్రప్రభుత్వమే తీసుకుని హిందీలో విద్యావిధానం నడిపే అనుభవాన్ని సంపాదించాలనే ఆలోచన వచ్చినది. ఈ ఆలోచన ఒక ముఖ్యమైన ఆటంకంగా ఉంటూ వచ్చినది. అట్టి ఆలోచనతో ఇక్కడ ఉండే ప్రజలుకాని, ప్రజాప్రతినిధులైన శాసనసభ్యులు కాని—ఎవ్వరూ ఏకీభవింపలేదని మీ కందరకు తెలుసును. ఈ విషయం అయిదారు సంవత్సరాలు చర్చలో ఉంటూవచ్చి ఎటూ నిర్ణయం కాకుండా ఉండడం వల్ల విశ్వవిద్యాలయ చట్టానికి సంబంధించిన ఎట్టి సవరణలు చేయడానికి ఎప్పటికప్పుడు ఆటంకాలు కలుగుతూ వచ్చాయి. ఛార్టరును మార్చి విశ్వవిద్యాలయాన్ని సరిఅయిన పద్ధతిలో రూపొందించాలనే ఆలోచన ఎప్పటికప్పుడు వాయిదా వేయబడుతూ వచ్చింది. చివరకు కేంద్రప్రభుత్వం ఒక నిర్ణయానికి వచ్చి, ఈ విశ్వవిద్యాలయాన్ని తమ స్వాధీనంలోనికి తీసుకునే ఆలోచన లేదని స్పష్టపరిచిన తరువాత ఈ చట్టంలో మార్పులు తీసుకువచ్చే సందర్భంలో సరియైన, సక్రమమైన పద్ధతిలో మార్పులు రావాలని చర్చించడం, కోరడం సహజమైన విషయం. దురదృష్టవశాత్తు ఎందుకు ఇట్లా అయినదో చెప్పలేను; ఊహించుకోవడానికే వదలిపెడతాను. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత తొమ్మిది మాసాలుగా ఈ విశ్వవిద్యాలయంలో తాత్కాలికంగా

వైస్-ఛాన్సెలర్ పని చేస్తుంటే ప్రభుత్వదృష్టి ఈ విశ్వవిద్యాలయం వైపు ఎందుకు పడలేదో ఆశ్చర్యంగా ఉన్నది. వైస్-ఛాన్సెలర్ ఏర్పాటుతో విశ్వ విద్యాలయాలకు సంబంధించిన సంస్కరణలు సవరణలు జరగడం సరిఅయినది కాదని, ఎవరూ హర్షింపరని మనవి చేస్తున్నాను. ఉస్మానియా విశ్వవిద్యాలయం వైస్-ఛాన్సెలర్ నియామకం జరిగిన సందర్భాలు, ఆ రోజులలో విద్యార్థులు, ఇతరులు ఒక ఉద్యమం లేవదీసిన సందర్భాలు శాసనసభ్యులకు తెలుసును. ఆ సందర్భంలో ఒకమంత్రి-కొంతమంది పెద్దలు కలుసుకున్న మీదట ప్రభుత్వపక్షాన చెబుతున్నానని కొన్ని హామీలను ఇచ్చారని విన్నాను. విద్యార్థులనుండి విన్నాను. మంత్రిగారు అక్కడక్కడ అన్నట్లు విన్నాను.

ఆ హామీ ఇచ్చినప్రకారంగా ఈ యూనివర్శిటీ బిల్లుద్వారా సంస్కరణ చేస్తాం, ఈ academic year ప్రారంభంలోగానే వైస్ చాన్సలర్ ఎన్నిక జరిగేటట్లు చేస్తానని హామీ యిచ్చినట్లు విన్నాను. ఆ హామీ ఏవిధముగా పూర్తి అయినదీ కాలేదు అనే సంగతి నాకంతగా పట్టులేదు. అది ఆ మంత్రిగారు ఆ విద్యార్థులు మిగతవారు తేల్చుకోనవలసిన విషయం.

శ్రీ బి. కేశవరెడ్డి (ఘనాపూరు) : ఆ మంత్రిగారెవరో తెలుపుతారా ?

శ్రీ యమ్. చెన్నారెడ్డి : అది చాలా అసందర్భమైన విషయమని భావిస్తున్నాను.

మిష్టర్ స్పీకర్ : మీయిష్టం అయితే చెబితే చెప్పండి. లేకపోతేలేదు. Nobody can compel you, because it may be delicate.

*Sri M. Channa Reddy :* It is neither delicate nor I want to avoid it deliberately.

ఆ మంత్రిగారు ఆవిధంగా హామీయివ్వడము—మొత్తం మంత్రివర్గం హామీ యిచ్చిందోలేదో నాకు తెలియదు— ఈనాడు వారు విద్యార్థులకిచ్చిన హామీని పూర్తిచేయడంలేదని నాకు కనిపిస్తున్నది. అందుకు నా విచారాన్ని ప్రకటిస్తున్నాను. Academic year లోపల వైస్ఛాన్సలర్ ఎన్నిక జరిపిస్తాం అన్నారు. తిరుపతి యూనివర్సిటీలో ఏవిధమైన ఎన్నిక జరిపించేపద్ధతి వుంటే అది చేస్తారని విద్యార్థులనుకుంటున్నారు. కాని తిరుపతి యూనివర్సిటీలో ఎన్నికలు జరుగుతాయా లేదా అంటే, తిరుపతికి జరిగినట్టుగా కావాలంటే మొదలే తిరుపతికి ద్వారం చేస్తే తరువాత ఉస్మానియా యూనివర్సిటీకి సమానంగా వుంటుందనే ఆలోచన వున్నట్లుగా మాత్రం కనబడుతుంది. అందుకని ఉస్మానియా యూనివర్సిటీ ఎన్నికలు గురించి తిరుపతి యూనివర్సిటీ చట్టానికి

ఆంధ్ర యూనివర్సిటీ చట్టానికి సవరణ చేయడంమాత్రం సమంజసమైనదికాదు. డాక్టర్ రాధాకృష్ణన్ కమీషనుచేసిన ముఖ్యమైన సూచనలను మేము తీసుకుని చేస్తున్నాం అని చెప్పడంలో ఒక పెద్దమాట, ఒక విలువైనమాట ఉందేమో అనేసంగతి ఎవరికైనా చెబితే మంచిదేకాని ఈనాడు వుండే context లో, యీనాడు వుండే వాతావరణంలో యిది చేయకుండా వుంటే బాగుండేది అని ప్రభుత్వానికి యిప్పటికీ సలహా యివ్వదలచుకున్నాను. మొదలు విద్యార్థుల కిచ్చిన హామీని అనుసరించి ఉస్మానియా యూనివర్సిటీ వైస్‌ఛాన్సులరు పదవి ఆంధ్ర యూనివర్సిటీలోవున్న పద్ధతినే ఎన్నికలు జరిపించే పద్ధతిచేసి, దాని తరువాత ఒక సంవత్సరమో, ఆరుమాసాలో గడచినతరువాత మొత్తం మూడు యూనివర్సిటీలను సవరణచేయాలని చెబితే బాగుండేది. అందరూ అది సరియైన పద్ధతని అర్థం చేసుకోడానికి వీలుంటుందేగాని వీటన్నిటినీ కలిపి వ్యవహారం జరపడం సమంజసమైనది కాదు. ఎవరూ ఒప్పుకోరు. ప్రజలు హర్షించరని యీ శాసనసభద్వారా మన ప్రభుత్వానికి మనవి చేయదలచుకున్నాను. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు, యీ హామీని పూర్తి చేయకపోతే మంత్రిగారు రాజీనామా యిస్తామని చెప్పారట. నిజముగా యింతవరకు జరిగిందో, లేదో, మంత్రిగారు రాజీనామా యిస్తారా? ఒక మంత్రిగారు రాజీనామా యిచ్చినంతమాత్రాన అది ముఖ్యమైనది అని అనుకునే వారిలో నేను మాత్రం ఒకరిని కాను. కాని విద్యార్థులకు ఆశాభంగం కలిగించే ఒక నిరుత్సాహకరమైన వాతావరణం కలుగడానికి ఎవరూ తోడ్పడకూడదు. ఆ విధమైన వాతావరణం కలుగజేయకూడదని మాత్రం సలహా చెబుతున్నాను. ఈ విషయంలో సెలెక్టుకమిటీకి పంపేలోగానే prestige అనే సమస్య అనుకోకుండా ఉస్మానియా యూనివర్సిటీ ఎన్నికను ఒక వ్యక్తికోరకే యిదంతా చేస్తున్నారనే అప్రతిష్ట యీ కాంగ్రెసు ప్రభుత్వానికి కలుగకూడదని ఒక కాంగ్రెసు సభ్యునిగానే స్పష్టంగా మనవి చేయదలచుకున్నాను. అది దృష్టిలో పెట్టుకుంటే యీ యిబ్బందులు వుండకుండా పోతాయి. ఈ వైస్‌చాన్సలర్ ఎన్నికవ్యవహారం జరిపే దానిని రాధాకృష్ణన్ కమీషన్‌వారు చెప్పారనే సమస్యను ఎందుకు దృష్టిలో పెట్టుకుని ఆచరణలో పెట్టుకోకూడదని చాలమంది అంటారు. ఆ విషయంలో నాకు కొన్ని స్పష్టమైన అభిప్రాయాలున్నాయి. నేను యిప్పుడు వాటిని మనవి చేయదలచుకున్నాను. నిజానికి వైస్‌చాన్సలర్ ఎన్నిక డాక్టరు రాధాకృష్ణన్ కమీషను రిపోర్టును మొత్తం దృష్టిలో పెట్టుకోకుండా ఒకటిమాత్రం ఏరుకుని తీసుకుంటే దాంట్లోవుండే మిగతాముఖ్యమైన సూత్రాలను ఆచరణలో పెట్టకుండా వున్నప్పుడు మిగతా power ను ఒకచోట

కేంద్రీకరించి senate కి వుండే అధికారాన్ని syndicate ప్రభుత్వం వారు జోక్యం కలుగజేసుకునే వాతావరణం ఇంకా మరింత కలుగజేసి అప్పుడు యీ nomination ను ఒక కమిటీకి అప్పచెప్పటం మాత్రం సరియైనది కాదని మనవి చేస్తున్నాను. డాక్టరు రాధాకృష్ణన్ కమీషను రిపోర్టు యొక్క spirit ఆచరణలో పెట్టకుండా ఒక అంశాన్ని తీసుకుని చేయడం తప్ప మరొకటి కాదు. ఇది అన్యాయం చేసినవార మవుతామేమో అనిపిస్తుంది ఈనాడు Senate లో వుండే అధికారాలు ఏవిధంగా Syndicate కి అప్పచెప్పబడ్డాయనేది గౌరవ సభ్యులు శ్రీ రాజేశ్వరరావుగారు చాలా వివరంగా చెప్పారు. ఒక్కొక్క section లో ఏవిధముగా జరిగింది? confirmant of degrees మిగతా విషయాల క్రింద ఒక్కొక్క senate power syndicate కి యిస్తే senate power కూడా సరిగా జరగడం లేదని మొన్ననే తిరుపతి confirmant of degrees విషయంలో వివరాలు పత్రికలో చూస్తే — వివరాలు నాకు తెలియదుగాని — వివరాలు నేను ఎక్కువగా చెప్పదలచుకోలేదు. senate కూడా సరైన పద్ధతిలో discretion ఉపయోగించడంలేదని, ఉపయోగించడానికి అవకాశం లేదని, అటువంటి పద్ధతిని syndicate కి అధికారాలివ్వడం మంచిదికాదు. ఒక రాజకీయ కార్యకర్తగా రాజకీయ వేత్తలకు యీ యూనివర్సిటీకి సంబంధం యీ డిగ్రీలిచ్చే సందర్భాన చాలా జాగ్రత్తపడడం, లేకపోతే రాజకీయ వేత్తలను ప్రజలు, సమాజం అంతా చిన్నచూపుచూచే పరిస్థితి రాకుండా చూడవలసిన అవసరంకూడా యీ శాసనసభకు, రాజకీయ వేత్తలకు వుందని మనవి చేస్తున్నాను. ఎవరికి ఏవిధంగా యివ్వడం అనేది కాదు. అధికారంలో వుంటే ఏ రాజకీయవేత్తయినా సరే ఎవరు degree యిచ్చినా ఒప్పుకోవడము అనే ఆచారం (convention) పెట్టుకుంటే ప్రజలు కూడా హర్షిస్తారు; సమాజం హర్షిస్తుంది అనుకునే వారిలో నేను ఒకడను. Senate కి బదులు Syndicate కి powers తీసుకోవడం న్యాయం కాదు అట్లాగే అనేక విషయాలు యీ బిల్లులో వున్నాయి. డాక్టరు రాధాకృష్ణన్ కమీషనువారి Vice-Chancellor ఎన్నిక వ్యవహారం అటుకుండా యీ Syndicate లో ఎంత మంది nominated members వున్నారు? ఎంత మంది ex-officio members వున్నారు? ఎంతమంది వారందరూ కలిసి ఎన్నుకున్నవారు? Senate నుంచి వచ్చే కొద్దిమంది సభ్యులు తప్ప మిగతా వారంతా Syndicateలో nominated members గా వున్నప్పుడు ఇద్దరు nominated members సరిపోదని గవర్నరుగారు లేక ఛాన్సలరుగారు మరొక పేరు nominate చేసి యీ ముగ్గురు కలిసి మరొక కొంతమందిని panel యిస్తే అందరినీ గవర్నరుగారే నిర్ణయం

చేసే పద్ధతి అచ్చంగా వడపోసి వడపోసి కాచి కషాయంకట్టి మింగజాలకుండా చేదుగోళిగా యీ ప్రజాస్వామికం గుర్తుకు వస్తుందని మనవిచేస్తున్నాను. Autonomous చేస్తున్నామా ? మంచి పదాలు వాడుతున్నప్పుడు ఉద్దేశ్య పూర్వకంగా హృదయపూర్వకంగా ఒప్పుకోవాలి ; నిజముగా యూనివర్సిటీలను autonomous చేయాలి. ప్రభుత్వంలో గాని, సమాజంలో గాని యీనాడు ఒక తత్వం ఉంది. అన్నిటికీ చేతులుకట్టి regimentation చేద్దాం అనే పద్ధతి ఒకటి వుంది. ఆ పద్ధతి మంచిదంటారా పూర్తిచేయండి. ఆ పద్ధతి మంచిది కాదు దానిని మనం ఎదుర్కొంటున్నాం ; మనకు కొన్ని ఆశయాలు, సిద్ధాంతా లున్నాయి అని చెప్పుకునేటప్పుడు వాటిని హృదయపూర్వకముగా సంపూర్ణంగా అమలు చేయాలి. లేకుంటే వదులుకోడానికైనా మనం సిద్ధంకావాలి. ఈ విధముగా చేసేదానికంటె వైస్‌చాన్సలరును గవర్న మెంటే నామినేటు చేయడం మంచిదేమో అనిపిస్తున్నది. ఒకసారి కాకపోతే ఒకసారైనా యీ గవర్నమెంటును అసెంబ్లీ వారైనా అడగ డానికి వీలుంటుంది; బాధ్యత తీసుకోవలసిన అవసరం వుంటుంది. ఈ గవర్నరు నామినేషనులు ఏవిధముగా జరుగుతూ వుంటాయో, చాన్సలరు నామినేషన్సు ఏ విధముగా జరుగుతూవుంటాయో అటువంటి democracy లో చాన్సలరు నామినేషను అంటే యేమిటో మనకు తెలుసును నిన్నకాక మొన్న లెజిస్లేటివు కవున్సిలుకు జరిగిన నామినేషన్సును చూస్తున్నాం. ఎన్నికల సమయంలో గెల్చుకోలేనివారిని కూడా యీనాడు గవర్నరు కవున్సిలుకు నామినేషను చేస్తూవుంటే అదిమాత్రం ఎవరి గౌరవప్రతిష్ఠలకు మంచిదికాదు.

*Sri N. Sanjeeva Reddy* : Mr. Speaker Sir, How is Governor's nomination relevant here? Governor cannot reply here.

*Mr. Speaker :* So, it is irrlevant, you have to go to another point.

శ్రీ పి. సుందరయ్య : వారు ఊరికనే ఒక objection raise చేశారు. మనం చర్చిస్తున్న యీ బిల్లులో చాన్సలరు Governor in his office shall be the Chancellor of the University అని వుంది. Governor, not as an individual is the Chancellor. Governor in this office చాన్సలరు అవుతాడు. అందుచేత constitution ప్రకారం Governor in his office is Chancellor. Then every thing he does shall be with the advice of the Government. ఈ చట్టంలో చాన్సలరుకు అనేకరకాలైన nominations యిచ్చారు. గవర్నరు హోదాలో మంత్రివర్గం చెప్పినరీతిగా nominations యివ్వాలని యీ బిల్లులో

వున్నప్పుడు నామినేషను దుర్వినియోగం అవుతున్నదని విమర్శిస్తున్నారు. గవర్నరును వ్యక్తిగతంగా విమర్శించడం కాదు. గవర్నరుకి నామినేషను చేసే అధికారం యివ్వటం ఏ రకంగా తప్పు అనే point ను వారు deal చేస్తున్నారు. How is it objectionable? How is it irrelevant?

*Sri N. Sanjeeva Reddi*: I am not telling about the Governor as the Chancellor. I know the leader of the opposition will heartily support my friend, Dr. Chenna Reddi.

*Sri P. Sundarayya*: I am not anxious to support Mr. Sanjeeva Reddi.

*Sri N. Sanjeeva Reddy:* Doesn't matter. I am not interested whether he supports me or not. It makes very small difference. అది కాదు నేను చెప్పేది. ఇక్కడ nominations గురించి, యూనివర్శిటీగురించి తప్పు పట్టండి. నాకు ఆక్షేపణలేదు. యూనివర్శిటీలో గవర్నరు నామినేటు చేయడం తప్పని వాదించండి. కాని ఎక్కడనో చేసిన లెజిస్లేటివు కౌన్సిలు nominations ఆక్షేపించడానికి "Is this the forum?" అని అడుగుతున్నాను. కవున్సిలు వచ్చినప్పు డది చేయండి. ఏ సమయంవచ్చినా ఏబెడ్డయినా వేస్తాం అనేరకంగా ఉపన్యాసాలు యిస్తే ఆ బెడ్డలే వేయవచ్చు. అంత కష్టమైన పనికాదు. బెడ్డలు వేయడం అందరికీ చాతనవును.

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు : ఇక్కడ గవర్నరుఅనే ప్రశ్నకాదు.

He is Chancellor of the Univesity in his position as Governor. But we use him as Chancellor and in his capacity as Chancellor he nominates them.

మిస్టర్ స్పీకర్ : ఇందులో గవర్నరుగారి నామినేషన్సు విషయములో చర్చవచ్చింది. గవర్నరుగారు ఛాన్సలర్ గా ఉన్నప్పుడు ఎడ్యుకేషన్ మినిస్టరు గారిని కాని చీఫ్ మినిస్టరుగారిని కాని consult చేయకుండా చేస్తారా? చేయరు. ఆ conventions నాకు తెలియవు. I may have my own opinion, I do not want to say anything. గవర్నగారిచేతుల్లో నామినేషను పెడితే గవర్నమెంటు చేతుల్లో పెట్టినట్లు అని జనరల్ గా వారు చెప్పడానికి అధికారము ఉన్నది కాని మొత్తముగా వారు అన్నీ వరుసపెట్టి ఒకొక్కటి చెబుతూఉంటే చాలా చిక్కు ఉన్నది. అదిమాత్రము irrelevant అన్నాను. Chief Minister గారు కూడా ఒప్పుకుంటున్నారు. I am glad he is also agreeing with me.

శ్రీ యమ్ చెన్నారెడ్డి: అధ్యక్షా, మీరు ముఖ్యమంత్రిగారు అందరు ఒప్పుకుంటున్నందుకు నాకు ఏమాత్రం ఇబ్బందిలేదు. గవర్నరుగారి nominations గురించి నా అభిప్రాయము మనవిచేశాను. నిన్న మొన్న జరిగి మన అందరి మనస్సులో ఉండేమాట ఉదాహరణకు చెప్పాను. కాని అంతకుమించికాదు.

మిస్టర్ స్పీకర్ : అటువంటి ఉదాహరణలు వద్దు వారెవరూ ఇక్కడ లేరు. ఇక్కడ లేనివారినిగురించి చెప్పవద్దు.

డాక్టర్ యమ్. చెన్నారెడ్డి : మిగతా కేసులు ఏమీ చెప్పలేదు. ఎవరికైనా బాధకలిగితే నేను చెప్పను.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు : అధ్యక్షా, మీరు ఇప్పుడు ఒక రూలింగు ఇచ్చారు. ఈ references ఉదాహరణలు చెప్పడము సవ్యముగాదనే అర్థము వస్తున్నది అంతేనా అని అడుగుతున్నాను. ఒక విషయము discuss చేసేటప్పుడు ఇక్కడ ఇట్లా జరిగింది, అక్కడ అట్లా జరిగింది అని explain చేయడము సహజము. అది లేకపోతే explanation అనిపించుకోదు. Nomination విషయం వచ్చినప్పుడు ఇట్లా జరిగిందని తదనుగుణ్యంగా ఉండే similar cases ను గురించి passing reference చేశారు. దానిమీద మీరు ఇలా చెప్పారు. ఇట్లాంటి reference చేసే అధికారము సభ్యులకు ఉన్నదా లేదా ?

మిస్టర్ స్పీకర్ : ఆ circumstances ను బట్టి ఉంటుంది. The speaker shall decide in each case. ఈ circumstances లో allow చేయడములేదు.

శ్రీ యమ్. చెన్నారెడ్డి : ఈ circumstances లో మీ రూలింగు నేను ఒప్పుకుంటున్నాను. ఈ యూనివర్సిటీ సంస్కరణ సందర్భాన నేను మనవి చేస్తూ ఉంటిని. మిగతా రెండు యూనివర్సిటీలలో సవరణలు కూడా ఈ విధముగా జరుగడము సమంజసమైనది కాదని సరైన సమయాన జరుగుట లేదని నా అభిప్రాయాన్ని మనవిచేశాను. దీనిని ప్రజాభిప్రాయానికి, యూనివర్సిటీవారి అభిప్రాయానికి పంపించినప్పుడు నేను తెలుసుకున్నంతవరకు యూనివర్సిటీవారు గాని Syndicate వారు గాని దీనిని సంపూర్ణముగా సమర్థించలేదు. అనేక సవరణలు అభిప్రాయాలు వారు స్పష్టంగా చెప్పారు. వాటిని ప్రత్యక్ష దృష్టిలో పెట్టుకోకుండా ఈ బిల్లులో Pro-chancellor ను మాత్రమే తప్పించి మిగతావన్నీ యథాతథంగా ఉంచడము న్యాయముకాదని మనవి చేస్తున్నాను. ఇది select కమిటీకి పంపుతారని విన్నాను కాబట్టి అక్కడైనా అన్ని అభిప్రాయాలు సెలక్టు కమిటీ సభ్యులందరికి ఇచ్చి తదనుగుణ్యముగా

మార్పులు చేయాలని నేను కోరుతున్నాను. యూనివర్సిటీకి సంబంధించిన సవరణలలో rigidity ని చూపించకుండా ఉంటేనే ప్రభుత్వానికి బాగా ఉంటుందని నేను వారికి సలహా చెప్పదలచుకున్నాను. దీనిలో అవిధమైన పట్టింపు ఉంటే మంచి వాతావరణము సృష్టింపబడుటకు తోడ్పడేవారు కాజాలరని మనవి చేస్తున్నాను. ఈ క్రొత్త మార్పు చేసే సందర్భాన మరికొన్ని విషయాలు స్పష్టము చేయవలసి ఉన్నది. డబ్బు ఇచ్చేవారు ఈ Senate లో ఉండుట మంచిదికాదా అనే దానిపై నిన్న బాగా చర్చలు జరిగాయి. డబ్బు ఇచ్చేవారిని చులకనగా చూడవలసిన ఉద్దేశ్యము ఎవరికిలేదు అని నేను అనుకుంటున్నాను. కాని ఒకటిమాత్రము నచ్చకుండా కనపడుతోంది. డబ్బు ఇచ్చేఆయన రావడముకూడా కాదు. డబ్బు ఇచ్చి ఒకతనిని nominate చేసే అవకాశము ఉంటే అది ఏ విధముగా గౌరవప్రదముగా ఉంటుందో నేను అంగీకరింపలేకున్నాను. డబ్బు ఇచ్చేవారికి గౌరవప్రదంగా ఉండుటకు ఒక hall కట్టి మంచి శిల్పముతో అక్షరాలు వ్రాసి పెట్టించితే బాగుంటుంది. కనీసము ఆయన అయినా వచ్చి స్వయముగా ఉంటే బాగుంటుంది కాని ఆయన డబ్బు ఇచ్చి ఇంకొకరిని పంపించడం ప్రభుత్వము nominate చేయడము, ఆ పద్ధతిని మార్చుకోవలసిన అవుసరము ఉన్నదని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను. ఈ nominations లో మరొక విషయం కనబడుతోంది. Teachers కు తగిన ప్రాతినిధ్యము syndicate లో లేకుండా ఉండటను మంచిదికాదని నిన్న ఒక మిత్రుడు అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. అంతకుమించి నేను ఒక అడుగు ముందుకుపోయి ఒక సూచనచేస్తాను. విద్యార్థుల సంఘాలు ఉన్నాయి. ఆ సంఘాలను మనము గౌరవిస్తున్నాము. విద్యార్థులు సమాజములో బాగా disciplined గా ఉండాలంటే విద్యార్థుల సంఘాలను మనమీనాడు చిన్న చూపు చూడకుండా వాటికి గౌరవప్రదమైన స్థానము ఇచ్చి " లా " లో లోటుపాట్లు ఏమైనా ఉంటే సరిచేసి వారిని చేర్చుకొని ఒక మంచి వాతావరణము కలుగజేస్తే బాగుంటుందని మనవి చేస్తున్నాను. National Union of Students అని మొత్తము మన భారతదేశములో ఏ రాజకీయ పార్టీతో ప్రమేయము లేకుండా అన్నింటికి అతీతముగా ఒక సంస్థను ఏర్పాటు చేసుకొని కొన్ని సంవత్సరముల నుంచి మనము పనిచేస్తున్నాము. దాని అనుభవాలు మంచివా, చెడ్డవా, కొన్ని చోట్ల మంచి అనుభవాలు, కొన్నిచోట్ల చెడ్డ అనుభవాలు కలుగడము సహజము. ఇంకా కొన్ని సంస్కరణలైనా చేసి విద్యార్థులకు National Union of Students సంస్థకు తప్పనిసరిగా ప్రాతినిధ్యము syndicate లో senate లో కల్పించడము అవుసరమని నాకు అనిపిస్తున్నది. నూతనమైన మార్పులు విప్ల

వాత్మకమైన మార్పులు కలుగజేసి discipline అనే దానిని కట్టుదిట్టము లలో చేయడానికి ఉపయోగపడాలని కోరుతున్నాను. ఈ సూచన విని కొంత మంది నవ్వుతూ ఉండడము, కొంతమంది ఆశ్చర్యపడుతూ ఉండడము చూస్తు న్నాను. కాని ప్రతి విప్లవాత్మకమైన విషయానికి నవ్వు, ఆశ్చర్యము, ఆందో ళన కల్గడము ఎప్పటికి సమాజములో జరుగుతూనే ఉంటుంది. అందువల్ల విప్లవాత్మకమైన మార్పులు లేకుండా సమాజము ఆగిపోదు. మార్పులు లేకుండా సమాజము అగిపోదు. మార్పులు చేసుకోవలసిన సమయము వచ్చినప్పుడు వాటిని తప్పకుండా ఆచరణలో పెట్టుకోవలసిన అవుసరము ఉంటుంది. Students వచ్చి discipline చెడగొడతారనేభయము మన సమాజ ములో పెద్దలకు పోగొట్టితేనే తప్ప ఈనాడు విద్యార్థుల సమాజాన్ని సంస్క రించడానికి వీల్లేదు. వారికికూడా బాధ్యత ఇవ్వండి. ఆ బాధ్యతను వారు తప్పకుండా నిర్వహిస్తారనే నాకు సంపూర్ణ విశ్వాసము ఉన్నదని మనవి చేస్తున్నాను. దీనిని దృష్టిలో పెట్టుకొని ఈవిధముగా చేస్తే మనకు విద్యార్థుల యొక్క సమగ్రమైన మంచిచెడ్డలు వారి అవుసరాలు, కష్టాలు, కోర్కెలు. సరైనపద్ధతిలో ఆస్థాయిలో అర్థముచేసుకొనవచ్చును. వారుకూడా యూని వర్సిటీ యొక్క సాధకబాధకాలు అర్థముచేసుకొని సరైన పద్ధతిలో వ్యవహ రించుటకు తోడ్పడినవారవౌతాము. అందుకు ఈ క్రొత్తపద్ధతిని ఆచరణలో పెట్టినవారమౌతామని నేను మనవిచేస్తున్నాను.

గవర్నమెంటు కంట్రోలును గురించికూడా మిత్రులు చెప్పారు. సెక్షను 8,20 ప్రత్యేకముగా దానిలోపెట్టి చట్టాన్ని చదువుతూ ఉంటే అది ఆచరణలో ఎట్లాజరుగుతుందో చెప్పడము సాధ్యముకాదు. రానురాను ఇది Glorified department of the Government అవుతుందా అనేపద్ధతిగా అందుకు సంపూర్ణ అవకాశము ఉన్నదని నాకు కన్పిస్తున్నది. ఆ రెండు సెక్షన్నును దృష్టిలో పెట్టుకుంటే autonomous అనే పదమును మనము ఏవిధముగా ఉపయో గించుటకు అర్హత ఉంటుంది? యూనివర్సిటీని autonomous body గా ఏవిధముగా చేయగలుగుతామనే సందేహము ఎవరికైనా కలుగుతుందని నాకనిపిస్తోంది. ఈ సెక్షన్సు 8, 20 దృష్టిలో పెట్టుకుంటే మొత్తము "autonomous" పూర్తిగాపోయి complete గా గవర్నమెంటు control క్రింద ఉంటే డిపార్టుమెంటు అవుతుందని అనిపిస్తోంది. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు ఈ సెక్షన్సు 8, 20 ఈ రెండింటిని మార్చుకునే పద్ధతిని వ్యవహారము చేయాలని అనిపిస్తోంది.

ఈ మూడు యూనివర్సిటీలకు co-ordination కావాలనే ఆలోచన మంచిదే. మొత్తము భారతదేశంలోని యూనివర్సిటీ లన్నింటికి co-ordination కావాలని ప్రయత్నాలు జరుగుచున్నవి. University Commission పెట్టుకొని దేశమంతా పర్యటన చేస్తూ కొన్ని సంప్రదాయాలు ఏర్పాటు చేయడానికి ప్రయత్నాలు జరుగుచున్నవి. ఒక యూనివర్సిటీకి మరొక యూనివర్సిటీకి ఏ విధంగా academic సంబంధ బాంధవ్యములు ఉండాలో, recognition ఏ విధంగా ఉండాలో, degrees స్థాయి ఏ విధంగా ఉండాలో, courses standards ఏ విధముగా ఉండాలో Indian Medical Council గాని I.C.A.R. గాని, Engineer మొదలగు విద్యలలో కాని, భారతదేశము మొత్తము మీద co-ordination ఉండాలనే ప్రయత్నాలు జరుగుచున్నవి. కాబట్టి ఒక రాష్ట్రములో ఉండే మూడు యూనివర్సిటీలలో co-ordination కావలయునని చేసే ప్రయత్నము ఈ బిల్లులో ఒక Clause లో అనుసరించునట్లు కనబడుతుందేగాని అది సరిపోదు. Co-ordination కు భిన్నముగా ఉంటోందని అనిపిస్తోంది. ఉదాహరణకు ముగ్గురు Municipal సభ్యులను ఆంధ్ర ప్రాంతము నుంచి, ఉస్మానియా ప్రాంతము నుంచి తిరుపతికి; ఆవిధముగా తిరుపతికి మరొక రెండు ప్రాంతాల నుంచి పెట్టే పద్ధతి, అది కూడా ఈ Local body పంచాయితీ సభ్యులను nominate చేయడము సరిపోదు అని నేను మనవి చేస్తున్నాను. పంచాయితీ బోర్డు సభ్యులకు ప్రత్యేక బాధ్యతలు కొన్ని ఉన్నాయి. వారు ఈ University లో ఉండి పని చేస్తారా ? అనే అనుమానము ఉన్నది. ఈ విధముగా చెప్పుటవల్ల వారంటే అగౌరవము ఉన్నదని అపార్థము చేస్తే అది పొరబాటు, దురదృష్టము అని మనవిచేస్తున్నాను. వారు చేయవలసిన పనులు వేరే ఉన్నవి. వారిని తీసుకువచ్చి యూనివర్సిటీ co-ordination కొరకు పెడతాము. యూనివర్సిటీ వెలుపల నుంచి తీసుకువచ్చి పెడతాము అనే తర్కముతో ఏకీభవించలేక ఉన్నాను. యూనివర్సిటీతో మునిసిపల్ మెంబర్సుకు, పంచాయితీ మెంబర్సుకు అధిక ప్రమేయము లేకుండా ఉండటము అవసరము. Teachers కు సంబంధించిన సంస్థలు Academic సంస్థలు ఉన్నాయి. వాటికి ప్రాతినిధ్యము ఇచ్చి ఏవిధముగా చేర్చుకో గలుగుతామో ఇక్కడ సూచనలు చెప్పడము కష్టము. రేపు Select Committee Stage లో అందరూ సమగ్రంగా ఆలోచించుకున్నప్పుడు అటువంటి వాటికి అవకాశాలు ఉంటాయనే ఉద్దేశంతో మనవిచేస్తున్నాను. ఒక ప్రాంతంనుండి ఇంకో ప్రాంతానికి కొందరు కౌన్సిల్ మెంబర్లను, మునిసిపల్ మెంబర్లను తెచ్చిపెట్టటంవల్ల కో-ఆర్డినేషన్ ఏమాత్రం కాజాలదు. పైగా

ఆ పద్ధతి కో-ఆర్డినేషన్‌కు భంగం తప్ప వేరొకటి కాదు. ఏమైనాసరే యీ బిల్లును మేము పాస్ చేస్తామని చెబితే, మీరు చేయజాలరు అనిచెప్పే ఉద్దేశం నాది కాదు. కాని ఒక మంచి వాతావరణం సృష్టింపజేయాలంటే, ప్రభుత్వానికి తిరిగి ఒక సలహా చెప్పదలచుకొన్నాను. మీరు (ప్రభుత్వం) ఉస్మానియా యూనివర్శిటీ వైస్ చాన్సలరుకు దీనికి ముడిపెట్టకండి. ఈనాడుకాదు, ఐదు సంవత్సరాల తర్వాత పది సంవత్సరాల తర్వాత, యీ బిల్లును చూస్తే, కథ అంతా జ్ఞాపకం వచ్చే యీ ముడి ఏదైతే పడ్డదో, దానిని తెగతెంపులుచేసి ఇప్పుడు వైస్‌చాన్సలరును ఏర్పాటు చేయటానికి ఒక పద్ధతి ఏర్పాటుచేసి, తరువాత మొత్తం బిల్లును సవరణచేస్తే బాగుంటుందని సలహా ఇస్తూ, నాకు యీ అవకాశం ఇచ్చినందుకు అధ్యక్షులకు కృతజ్ఞత తెలుపుకొంటున్నాను.

*హోంశాఖామంత్రి (శ్రీ కె. వి. రంగారెడ్డి) : అధ్యక్షా, ఇంతవరకు గౌరవనీయ సభ్యులు ఇచ్చిన ఉపన్యాసాలవల్ల కొన్ని విషయాలలో అపోహ కలిగే అవకాశం ఉన్నందువల్ల, వాటిని తొలగించుటకొరకు నేను మాట్లాడ దలచుకొన్నాను. ఒక మంత్రి స్టూడెంట్స్‌కు హామీ ఇచ్చారనే విషయం కూడ సభ్యుల ఉపన్యాసాల్లో వచ్చింది. "స్టూడెంట్స్‌కు ఏమి హామీలు ఇచ్చారు? ఆ ఇచ్చిన హామీలన్నీ సక్రమంగా బిల్లులో చేర్చబడినవా" అన్నది వివరంగా తెలియకపోతే, స్టూడెంట్స్‌లో కూడ అపోహ కలుగవచ్చును. గౌరవనీయ సభ్యులకు కూడ సరైన అభిప్రాయాలు ఇవ్వటానికి అవకాశము కలుగకపోవచ్చును. అందుచేత ఆ విషయాలన్నీ నేను స్పష్టము చేయదలచాను.

మొదట, ఆ హామీఇచ్చిన మంత్రిని నేనే. నేను హామీ మూడు విషయాల గురించి ఇచ్చాను. అప్పుడు వారు స్ట్రైయిక్ కేవలం వైస్‌చాన్సలరు గురించి చేశారు. బిల్లులో ఉన్న ఏ విషయం గురించి వారు స్ట్రైయిక్ చేయలేదు. ముందు వైస్‌చాన్సలర్ ఎన్నిక ఏ విధంగా జరుగవలెననే విషయము గురించి నేను వారికి హామీ ఇచ్చిన మాట నిజమే. అందులో నేను వారికి మూడు విషయాలు మాత్రం చెప్పినాను. 1. వెంకటేశ్వర యూనివర్శిటీకి, ఉస్మానియా యూనివర్శిటీకి వైస్‌చాన్సలర్ ఎన్నికపద్ధతి ఒకటేవిధంగా ఉండవలెనని వారు కోరారు. ఒకటేవిధంగా ఉంచబడుతుందని నేను హామీ ఇచ్చాను. 2. బడ్జెట్ సెషన్‌లోనే యీ బిల్లు ప్రవేశపెట్టాలని వారు కోరారు. దానికికూడ నేను హామీ ఇచ్చాను. 3. బిల్లు అంగీకరింపబడిన తర్వాత, సాధ్యమైనంత త్వరలో అది అమలుజరపబడవలెను అని అన్నారు. ఆ విషయంలో కూడ వారికి హామీ ఇచ్చాను. ఈ మూడు విషయాలు సంపూర్ణంగా యీ బిల్లులో ఉన్నవి. మొట్టమొదట వెంకటేశ్వర యూనివర్శిటీలో యీ బిల్లు ప్రవేశపెట్టబడింది. వైస్

చాన్సలరు ఎన్నిక పద్ధతి, వెంకటేశ్వర యూనివర్శిటీ సవరణ బిల్లులో, ఉస్మానియా యూనివర్శిటీ సవరణ బిల్లులో, ఒకటేవిధంగా చూపబడినవి. ఈ బిల్లుకొరకు ఏ కమిటీ అయితే ఏర్పడిందో, ఆ కమిటీ ఇచ్చిన సూచనలను దృష్టియందు ఉంచుకొని సాధ్యమైనంతవరకు ఈ రెండింటి విధానం ఒకటిగా ఉంచబడుతుందని నేను వారికి హామీఇచ్చాను. ప్రస్తుత పరిస్థితులలో పూర్వం వెంకటేశ్వర యూనివర్శిటీకి వైస్‌చాన్సలర్ ఎన్నిక కొరకు ఏ సిద్ధాంతమైతే చూపబడిందో, అది చాలా నష్టదాయకమని మనదేశంలోనే కాకుండా, ఇతర దేశాల్లో కూడ అంగీకరించారు. ఆ విధంగా అంగీకరించి, ఒక క్రొత్త విధానాన్ని 'ఏర్పాటు చేశారు. అందులో కొంతవరకు 'ఎన్నిక' కూడా ఉన్నది. కొంతవరకు 'నామినేషన్' ఉన్నది. ఆ విధానం చాలా మంచిదని తలచినందువల్ల, దానిని పెట్టారు. కొందరు గౌరవనీయ సభ్యులు దానిని రాజకీయరంగంగా చేయకూడదని ఆక్షేపించారు. రాజకీయరంగం కాకుండా, ఇండిపెండెంట్‌గా చాలా సుస్థిరంగా పని చేయవలెననే దృష్టితోనే ఇప్పుడు ఉన్న సిద్ధాంతాన్ని అంగీకరించారు. ప్రస్తుతం ఏర్పడే యూనివర్శిటీ లలోకూడ అదేవిధానం పెట్టబడిందనే విషయం గౌరవనీయ సభ్యులకు తెలియని విషయంకాదు. ఏవో పాతకాలపునాటి ఎన్నికలను ఇప్పుడు పెట్టటం యూనివర్శిటీకి లాభదాయకం కాదని గౌరవనీయ సభ్యులకు తెలిసిన విషయమే. 'ప్రభుత్వం పెట్టినదంతా చెడు, అని అంటే అది వేరే విషయము. మంచి సిద్ధాంతం కావాలనే దృష్టితో చూచినట్లయితే, గౌరవనీయ సభ్యులలో ఒక్కరుకూడ ఇప్పుడు ఉన్న సిద్ధాంతం మంచిదికాదని చెప్పరు. ఇప్పుడు ఉన్న యీ సిద్ధాంతం మంచిదికాదని చెప్పేవారు గౌరవనీయ సభ్యులలో ఒక్కరు కూడ ఉండరని నా సంపూర్ణ విశ్వాసము. కాబట్టి నేను ఇచ్చిన హామీలు పూర్తికాలేదనే (తీర్చబడలేదనే) విషయం ఎంతమాత్రం సరైనది కాదని నేను మనవిచేస్తున్నాను. విద్యార్థులలో కొంతమంది అనుభవం తక్కువ ఉన్నవారు ఉంటారు. ఇవాళ మనం మాట్లాడినవన్ని పత్రికలలో వస్తాయి. రేపే వారు నాదగ్గరకు రావచ్చు. "ఏమయ్యా ? మీరు చెప్పినవన్నీ అమలులోకి రాలేదే ?" అని నన్ను అడుగవచ్చు, కాబట్టి నేను యీ విషయము స్పష్టము చేస్తున్నాను. విద్యార్థులు మధ్యమధ్య వచ్చి నన్ను అడుగుతుంటే. వారికి నేను సమాధానం కూడ చెబుతున్నాను. వారు నావద్దకు వచ్చి సమాధానపడి. "మీరు ఏదైతే హామీ ఇచ్చారో, అది పూర్తి అయింది" అని అంగీకరించి వెళ్ళారని నేను మనవిచేస్తున్నాను. కాబట్టి నేను ఇచ్చిన హామీలు పూర్తికాలేదనే విషయం యదార్థమైన విషయం కాదని నేను మనవిచేస్తున్నాను. ఇప్పుడు ఇందులో

పెట్టబడిన సిద్ధాంతం, ఇంతవరకు ఉన్న అన్ని సిద్ధాంతాలకన్నా ఉత్కృష్టమైన సిద్ధాంతమనికూడ నేను మనవి చేస్తున్నాను. గౌరవనీయులైన సభ్యుల ఉపన్యాసాలు వింటూంటే నాకు ఒక సందేహం కలుగుచున్నది. ఇప్పుడు ఉన్న సిద్ధాంతం ప్రకారం ప్రభుత్వం ఏమిచేస్తుందో నాకు తెలియదు. గవర్నర్ ఏది చేసినప్పటికీ ప్రభుత్వం చెప్పిందే చేస్తారని భావించటం సరైంది కాదు. ప్రభుత్వ వ్యవహారాలు ఏవైతే ఉన్నవో, వాటిని ముఖ్యమంత్రిగారు పంపితే, గవర్నరు గారు అంగీకరింపవలసి ఉంటుందిగాని, వారికి ప్రభుత్వంతో సంబంధంలేని విషయాలు ఏవైతే ఉంటాయో, అవి వారు స్వయంగానే నిర్ణయిస్తారు. ఇప్పుడు రీజనల్ కమిటీ వ్యవహారము ఉన్నది. ఈ విషయంలో కేబినెట్‌గాని ముఖ్యమంత్రిగారుగాని సలహా ఇవ్వరు. గవర్నరుగారే స్వయంగా తీర్మానం చేస్తారు. మొన్ననే ఒక సమస్య గవర్నరుగారికి పంపబడింది. అది ప్రభుత్వంతో ఆలోచించి గవర్నరుగారు పరిష్కారం చేయరనే నా అభిప్రాయము. అదే విధంగా చాన్సలర్ తమ అధికారం పద్ధతి ప్రకారంగా తనే నిర్ణయిస్తారుగనుక, ప్రభుత్వం తన చేతులో యీ వైస్ చాన్సలర్‌ను నియమించే అధికారం ఉంచుకొన్నదని అపోహపడటం నిరాధారమని నేను మనవిచేస్తున్నాను. ఈ సిద్ధాంతంమీద చేయబడిన ఆక్షేపణలు సరైనవి కావని తెలయజేస్తున్నాను విద్యార్థులకు ఇచ్చిన హామీలు పూర్తి చేయలేదనే ఆక్షేపణకూడ నిరాధారమని నేను మనవిచేస్తూ, ఇంతటితో ముగిస్తున్నాను.

*శ్రీ యల్. లక్ష్మణదాసు (పాతపట్నం - జనరల్) : అధ్యక్షా! ఈ రోజున ఈ **University Bill** ను తీసుకొని వచ్చేటప్పుడు దురదృష్టవశాత్తు ఆంధ్ర తెలంగాణ అనే విభేదాలు ఎప్పటి కప్పుడే లేవడము అంటే, ఇది మన దేశానికే దురదృష్టకరమని నేను భావిస్తున్నాను. ఏ ముఖ్యమైన సమస్యవచ్చిన యీ విభేదాలు వస్తూనే ఉన్నవి. ఈ విభేదాలు తగ్గించుకోటానికి ఆంధ్రజాతి అనే వారము ఆందరము ఒక్కచోట చేరుకోటానికి మన కందరికీ ఒక్కటే రాష్ట్రి మును ఏర్పాటుచేసుకున్నాము. దీనికి సంతోషించేబదులు విచారము ఏర్పడుతూ ఉన్నది. డాక్టర్ చన్నారెడ్డిగారు మాట్లాడుతూ ఉస్మానియా విశ్వవిద్యాలయము నకు **Vice-Chancellor** ను **appoint** చేయుటమువల్ల తెలంగాణ ప్రజలు అలజడి చెందుతున్నారని అన్నారు. అలాంటి అలజడి విద్యార్థులలోను, ప్రజలలోను కలిగేటట్లయితే ఆ విశ్వవిద్యాలయమును అభివృద్ధికి తెచ్చుకోగలమా అని నేను ప్రశ్నిస్తున్నాను. ఆంధ్ర విశ్వవిద్యాలయము ఏ విధముగ అభివృద్ధికివచ్చినదో మనవి చేయదలచుకున్నాను. ఆంధ్రవిశ్వవిద్యాలయం ఏర్పడినప్పుడు అది మొట్ట మొదలు ఏ పరిస్థితిలో స్థాపించబడినదో మన అధ్యక్షులవారికిగూడ తెలుసు.

ఆనాడు మద్రాసు ప్రభుత్వము ఆంధ్రుల ఎడ, ఆంధ్ర విశ్వవిద్యాలయ స్థాపన విషయములో సవతితల్లిప్రేమ చూపించి అది ముందుకు రాకుండా ప్రయత్నించారు. ఆ సమయములో మన ఆంధ్రయోధులైన డాక్టరు సి. ఆర్. రెడ్డిగారు సర్. ఎస్. రాధాకృష్ణగారు, వీరి యిరువురి కృషి ఫలితముగ దానిని క్రమేణ అభివృద్ధిలోనికి తెచ్చుకున్నాము. ఆ విద్యాలయమును డబ్బులేని పరిస్థితితో స్థాపించడము జరిగింది. ఆర్థిక అభావముతో స్థాపించబడిన ఆ విశ్వవిద్యాలయము ప్రతివిషయములో ఎన్నో యిబ్బందులకు గురి అవుతూ వచ్చింది. విద్యార్థుల యొక్క, ప్రజలయొక్క ఉద్దేశ్యము ఆంధ్ర విశ్వవిద్యాలయమును త్వరలో ముందుకు తెచ్చుకోవాలని వాంఛించినప్పటికినీ, అది అనుకున్నంత తేలికగా సాధ్యపడలేదని మన డాక్టరు చెన్నారెడ్డిగారు గమనించగలరని ఆశిస్తున్నాను. మన Opposition party డిప్యూటీ లీడరుగారయిన రావి నారాయణరెడ్డిగారు మాట్లాడుతూ Democracy కి సంబంధించిన విషయాలను గురించి మాట్లాడారు. అందుకు నాకు ఎంతో విచారము కలిగింది.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు : Point of order, Sir గా. లక్ష్మణదాసు గారు యీ బిల్లును గురించి మాట్లాడుతారని మేము అందరము ఎదురుచూస్తూ ఉన్నప్పటికినీ, వారు ఏదో విషయాలనుగురించి మాట్లాడుతూ చెన్నారెడ్డిగారిని రావి నారాయణరెడ్డిగారిని దూయబట్టుతూ మాట్లాడుతున్నారు. ఇక్కడ సభలో 300 మంది సభ్యులు ఉన్నారు. బిల్లును గురించి మాట్లాడకుండా ఇంకా ఏవో విషయాలనుగురించి మాట్లాడడానికి ప్రయత్నిస్తున్నారా అని అనుమానము కలిగింది. బిల్లునుగురించి మాట్లాడుతూ రావి నారాయణరెడ్డిగారి పేరు ఎత్తితే అర్థము ఉన్నది. కాని, బిల్లుఊసే ఎత్తుకోకుండా వారి పేర్లు, వీరి పేర్లు, రంగా రెడ్డిగారి పేరు, సంజీవరెడ్డిగారి పేరు, అందరిపేర్లు ఎత్తుతూ మాట్లాడుతున్నారని, బిల్లు సంగతి మాట్లాడడములేదని మీ దృష్టికి తెస్తున్నాను.

*Mr. Speaker*: I am sorry to say that Mr. Pillalamarri Venkateswarlu has obstructed the proceedings of the Assembly. There is no point of order in what he has said. దానిని రైటుచేయడము లక్ష్మణదాసుగారు చెప్పినదానిని relevant అని irrelevant అని నేను ఇప్పుడు చెప్పదలచలేదు. I am very sorry for this. I request him not to speak such things hereafter.

శ్రీ యల్. లక్ష్మణదాసు : మనము డెమాక్రసీని విడిచిపెట్టి వెనుకకు పోతున్నామేమిటి అని, వారు అన్నారు. నిజానికి డెమాక్రసీని గురించి వారు

మాట్లాడే అవకాశము వారికి ఉన్నదా, లేదా అనే అనుమానము కలుగుతున్నది. మనకు స్వరాజ్యము వచ్చినతరువాత Democracy సక్రమమైన పద్ధతిలోనే మనము దేశములో నడుపుకుంటున్నాము. అయితే విశ్వవిద్యాలయములో ఎంతవరకు మనము Democracy ని అమలుపెట్టాలి? Vice-Chancellor ను అందరము కూడ ఏవిధంగా ఎన్నుకోవాలి అనేది ఆలోచిస్తే, మన దేశములో అనేక విశ్వవిద్యాలయము లున్నవి. ఢిల్లీలో కూడ విశ్వవిద్యాలయము ఉన్నది. దానికి ప్రభుత్వము ఒక కమిటీని ఏర్పాటుచేసుకున్నది. అక్కడి పరిస్థితులను గమనించితే. Vice-Chancellor అనే ఆయన యూనివర్సిటీకి ఒక ప్రధానస్థానము అలంకరించవలసి యున్నది. దేశ పురోభివృద్ధి ఆయనపైన ఆధారపడి యున్నది. ఆయన ఒక ప్రముఖపాత్ర వహించవలసి ఉంటుంది. అలాంటి వ్యక్తి ఎన్నిక అయినారంటే దేశములో ముఖ్యులు, విజ్ఞానవంతులు అని చెప్పక తప్పదు. దేశాభివృద్ధికి తోడ్పడగలిగిన వారే దానికి తగిన వ్యక్తి అని చెప్పక తప్పదు. అలాంటి విజ్ఞానవంతుని ప్రభుత్వం సెలెక్టుచేసి ఆ స్థానమును అలంకరింపజేసి ఉండవచ్చునని మనము గుర్తించాలి. అలాంటివారిని ఎవరినైన ప్రభుత్వం నిర్ణయించి appoint చేస్తే, ఆ నిర్ణయము మంచిదికాదు అని చెప్పడము, అది ప్రజాస్వామికానికే విరుద్ధము అని చెప్పడము మంచిది కాదు. ప్రజాసీకానికి ఏవో సాకులు చెప్పి ప్రజలను రెచ్చగొట్టడము మంచిది కాదు. దేశము యొక్క అభివృద్ధిని కోరే ప్రభుత్వము ఆస్థానానికి తగిన వ్యక్తిని తెచ్చి వేసిందంటే, అది వాస్తవానికి మంచిదే. మనముకూడ నిజపరిస్థితులు గుర్తించాలి. ఢిల్లీ యూనివర్సిటీలోను, యితర యూనివర్సిటీలలోను యీఎన్నిక పద్ధతి యిదే విధముగ ఉన్నది. విద్యారంగము అభివృద్ధికి తేవాలంటే చాలా కట్టుదిట్టముగాను జాగ్రత్తగాను పరిశీలించవలసిన అవసరము ఉన్నది. ఒక్క ఆంధ్ర యూనివర్సిటీ విషయము చూస్తే, అది ఏర్పడి యిప్పటికి 25 సంవత్సరములు దాదాపు పూర్తి కావచ్చినది. అప్పటినుంచి ఇప్పటివరకు ఎన్నిక పద్ధతిలో ఉన్నప్పటికినీ ఈ నాడు మనకు ఉన్న పరిస్థితులను బట్టి, విజ్ఞానవంతుల సలహాలను అనుసరించే ఇతర విశ్వవిద్యాలయములలో మాదిరిగా ఈ విధముగ నామినేటు చేయడము కొంతవరకు సమంజసమవే నేను భావిస్తున్నాను. ప్రపంచములో ఏ దేశము లోను చేయలేనంత experiment ను మన భారతదేశములో Democracy ని అమలు పరుచుకుంటున్నాము. దీనిని మన కమ్యూనిస్టు సోదరులు ఆక్షేపణ చేస్తున్నారంటే చాలా విచారకరముగ నున్నది. Vice-Chancellor విషయము కాకుండా మన కమ్యూనిస్టు సోదరులు యింకొక విషయము లేవదీశారు. ధనవంతులకు అందులో స్థానము యిచ్చి ఓటింగు హక్కు ఎందుకు యిరనిచ్చా

ఆక్షేపణ చేస్తున్నారు. University అభివృద్ధి పరచుకోవాలంటే, దానికి అవసరమైనంత డబ్బు కావాలి. ప్రభుత్వము డబ్బు ఇవ్వలేని పరిస్థితిలో ఉన్నప్పుడు ఇక ప్రజలవద్దనుంచి Donations అయినా పోగుచేయాలిగదా. ఏ ప్రముఖ, స్థానము ఇవ్వకపోతే మనకు డబ్బు ఏ విధముగ ఇస్తారు అనేది గుర్తించాలి. ఏ పదివేలో, ఇరవైవేలో అంతకుపైగానో ఇచ్చినవారిని అందులో మెంబర్లుగా చేర్చితే తప్పేమిటి? ఈలాంటి విధానము ప్రభుత్వము అవలంబిస్తే, ఈ Donors అందరు విశ్వవిద్యాలయమును తమ స్వంతము చేసుకుని ప్రపంచములో ఊరేగింపు చేసుకుంటారేమోనని మన Opposition Party మిత్రులు భయపడుతున్నారు. కాని ఇన్ని సంవత్సరముల అనుభవము మనకు బాగుగ తెలుసును. ఆంధ్ర విశ్వవిద్యాలయము ఈ Donations మూలంగానే అభివృద్ధిలోనికి రాగలిగింది. ప్రభుత్వం తగినంత డబ్బు ఇవ్వలేకపోతున్నది. అందులో మెంబరుషిప్పు యిచ్చిన ఏ ధనవంతుడు కూడ ఇంతవరకు అలాంటి తలంపు పెట్టుకోలేదు. అనేకమంది మహారాజులు, అభిమానులు, ధనవంతులు లక్షలకొలది డబ్బు ఇచ్చినందువల్లనే దానిని పోషించుకో గలుగుతున్నాము. అందువల్ల అది యింత తొందరగా అభివృద్ధికి రాగలిగిందని నమ్మాలి. వేలకొలది, లక్షలకొలది డబ్బు ఇచ్చిన దాతలు ఉన్నారు. అందులో ఒక్కరైనా ఆ విశ్వవిద్యాలయమును స్వంతము చేసుకుందామని తలంచలేదు. మద్రాసు ప్రభుత్వము మనమీద ఎంతవరకు సవతితల్లిప్రేమ చూపించారో అది ఆంధ్రులమైన మనకే తెలుసు. ఆ ప్రభుత్వము ఎంతవరకు సవతితల్లి ప్రేమ చూపించినను, వారిని లక్ష్యపెట్టక దాతల సహాయముతో ఆ యూనివర్శిటీని అభివృద్ధిలోనికి తెచ్చుకోగలిగాము. కాబట్టి అలాంటి దురభిప్రాయము ఎవ్వరికీగూడ లేదు. ఈ 25 సంవత్సరముల అనుభవమునుబట్టి చూస్తే ఎవరో శ్రీమంతులు, విద్యయందు ఆసక్తి గలవారు మన ఆంధ్ర విశ్వవిద్యాలయము అభివృద్ధికి రావాలనే కోరుతున్నారు. University administration హస్తగతము చేసుకోవాలని కోరలేదు. అలాంటిది చేయరనే నాకు నమ్మకము. అందులో డబ్బు ఇచ్చేవారిని సెనెటులో represent చేయటానికి ఎవ్వరుకూడ అభ్యంతరము పెట్టరాదనే నా అభిప్రాయం. మన దేశకాల పరిస్థితులనుబట్టి మన విధానాలనుకూడ మార్చుకోవలసిన అవసరము ఉంటుంది. అంతమాత్రముచేత యీ కొద్ది మార్పుకు గందరగోళము చేయడము న్యాయము కాదు. ఆంధ్ర యూనివర్శిటీకి బోస్తుగాధనము కొరతగా ఉన్న సమయములో ఏ విధముగ ప్రజలవద్దనుంచి, విజ్ఞానవంతులనుంచి ఉన్నత విద్యాభివృద్ధికొరకు పాటుపడిందన్నీ అందరికీ తెలియకపోలేదు. దేశభవిష్యత్తు ముఖ్యంగా యూనివర్శిటీసు మీదనే ఆధారపడి ఉంటుందని గుర్తించాలి.

ఈనాడు మన ఆంధ్రప్రదేశ్ కంతటికినీ మూడు విశ్వవిద్యాలయాలు మాత్రమే ఉన్నవి. మన ఆంధ్రుల యొక్క జనాభానుబట్టి, ఆంధ్రప్రదేశ్ యొక్క విస్తీర్ణమునుబట్టి, మనకు యీ మూడున్నూ చాలవు. ఇంకను మూడు, నాలుగు విశ్వవిద్యాలయాలు స్థాపించుకోవలసిన అవశ్యకత కన్పిస్తున్నది. తరువాత Vice-Chancellor యొక్క జీతమునుకూడ కొందరు ఆక్షేపణచేశారు. వాస్తవమునకు Vice-Chancellor పదవి మన దేశపురోభివృద్ధికి మూలకారణమైనది. ఆయనకు రాష్ట్రములో అందరికంటె హెచ్చు బాధ్యతలు వున్నవి. ఆయన బాధ్యతలు గురుతరమైనవి. ఆయనయొక్క కృషిని బట్టే, మనపిల్లలను ఉన్నతవిద్యలో ఉత్తీర్ణులను చేయగలుగుతాము. అందువల్ల ఆయనను అందరికంటె హెచ్చు జీతము యివ్వదగును. ఆంధ్ర విశ్వవిద్యాలయము మొట్టమొదట స్థాపించినప్పుడు డాక్టరు C. R. Reddi Garu మొదటి Vice Chancellor గా నియమితులైనారు. ఆనాడు నిజంగా ఆ యూనివర్సిటీకి డబ్బులేదు. మద్రాసు ప్రభుత్వం యొక్క సవతితల్లి ప్రేమవల్ల దానిని వృద్ధిలోనికి తేవటానికి వారు ఎంతో కృషిచేశారు. నిజానికి ఆయన చేసిన కృషి అమూల్యమైనదని చెప్పక తప్పదు. మన ఆంధ్రదేశములోని విజ్ఞానవంతుల దగ్గరనుంచి, మహారాజుల దగ్గరనుంచి, ధనవంతులదగ్గరనుంచి వేలకొలదిడబ్బు సేకరించి, ఆయూనివర్సిటీని తన బిడ్డమాదిరిగా చూచుకుని పోషించి అభివృద్ధికి తెచ్చారు. ఆయన Vice-Chancellor పదవిని అలంకరించినందువల్లనే ఆ యూనివర్సిటీ ఈనాటికి యింత అభివృద్ధిలోనికి రాగలిగింది. ఏ యూనివర్సిటీ అయినా మంచి విజ్ఞానవంతుని చేతిలో ఉంచితే, ఆయనద్వారా మనబిడ్డలకు ఉన్నత విద్యరావడమే కాకుండా, దేశమునకు అవసరమైన కార్యక్రమములు సాధించటానికి అవకాశములు నెరవేర్చుకునే అవకాశములు ఉండగలవు. గురుతర బాధ్యతలను వహించి దేశము యొక్క అభివృద్ధికొరకు పాటుపడే వ్యక్తి, యీ Vice-Chancellor పదవిని అలంకరించుతున్నప్పుడు ఆయనకు హెచ్చుజీతము యివ్వడమును ఆక్షేపణచేయడము అవ్యక్తము. దేశములో మనము ప్రవేశపెట్టుకున్న Democracy విధానము అమలుజరుపుకోవడము ఆయనమీదనే ఆధారపడి ఉంటుంది. అలాంటి వ్యక్తికి హెచ్చుజీతము యిస్తేమటుకు వచ్చినతప్పుఏమిటి? ఈ యూనివర్సిటీని ప్రజలచేత ఎన్నుకున్న ప్రతినిధులే పరిపాలన చేసుకుంటున్నప్పుడు, అలాంటివారిని గవర్నరు నామినేటు చేస్తేమటుకు ప్రమాదమేమున్నది? అంతే కాని ఎవరో పరాయివారువచ్చి యూనివర్సిటీని పరిపాలించడంలేదు. అలాంటి ప్రతినిధి యూనివర్సిటీ పరిపాలనలో తప్పుచేస్తే, దానినిగురించి అడిగే అవకాశములు మనకు ఇక్కడ ఉన్నవి. ఇలాంటి విధానమువల్ల సెనేటుకు ఇచ్చిన అధి

కారములు తగ్గిపోతాయేమోనని కొంతమంది సభ్యులు అనుమానించుచున్నారు. సెనేటుయొక్క అధికారములు తగ్గిపోకుండా చేసే అవకాశము సెలెక్టుకమిటీవారు చూడగలరు. సెలెక్టుకమిటీవారు యీ బిల్లును పరిశీలించబోతున్నారు. అట్లా తగ్గిపోకుండా చూడవలసిందిగా నేను సెలెక్టుకమిటీ సభ్యులకు మనవిచేస్తున్నాను. Senate అనేది యూనివర్సిటీ పరిపాలనకు ప్రధానమైన Body. దానిలోనుంచి ఎన్నుకోబడినవారే సిండికేటులో ఉంటారు. కాబట్టి యీ విషయములన్నియు రేపు సెలెక్టుకమిటీవారు క్షుణ్ణముగాను, సావకాశముగాను పరిశీలించవలెనని మనవిచేస్తున్నాను.

ఇదిగాక గౌరవసభ్యులు మరొక విషయమును గురించి మాట్లాడారు. అందులో స్త్రీలకు representation లేదని అన్నారు. నా అభిప్రాయము కూడ స్త్రీలకు అందులో representation ఉండాలనే. Backward Communities కు స్థానము యిచ్చారు. హరిజనులకు, గిరిజనులకు స్థానముయిచ్చారు. నా మిత్రుడు చెన్నారెడ్డిగారు దీనిలో పంచాయతీబోర్డు ప్రెసిడెంట్లకు, Municipal Council Chairmen కు స్థానము ఎందుకు ఇవ్వాలని అన్నారు. మనము ఒకప్రక్కన Democracy కావాలంటున్నాము. అందరికీ representation ఉండేటట్లు చూడాలి. (Interruption)

మిస్టర్ స్పీకర్ : తరువాత మాట్లాడే సభ్యులు ముందు మాట్లాడిన సభ్యులను గురించి మాట్లాడవచ్చు. తప్పేమి లేదు. ఇందాక పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు వారివి గురించి, వీరిని గురించి మాట్లాడుతున్నారు అని ఆక్షేపణ చేశారు. ఆవిధముగా ఆక్షేపణచేయడము తప్పు. ఎవ్వరిపేరు అయినా చెబుతూ మాట్లాడవచ్చు. అందులో తప్పేమీలేదు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు : అధ్యక్షా, ఇందాక లక్ష్మణదాసు గారు గాని, మరెవ్వరు గాని యింకొకరి పేర్లను గురించి మాట్లాడకూడదని నేను అనలేదు. ఆ విషయమును గురించి నేను మీకు సరిగా చెప్పలేకపోయినందువల్ల మీరు ఆ విధముగ రూలింగుఇచ్చారేమోనని అనుకుంటున్నాను.

మిస్టర్ స్పీకర్ : అసలు విషయము అదికాదు. అది point of order అని చెప్పినప్పుడు, అది అవునా కాదా అని ఆలోచించవలసివచ్చినప్పుడు అందులో point of order నాకేమి కనబడలేదు. కాబట్టి ఇకమీదట point of order అని చెప్పి, సభ్యుడిని మాట్లాడనివ్వకుండా అడ్డుతగిలి, లేచి మాట్లాడటానికి ప్రారంభిస్తే, అందులో ఏ point of order లేకపోతే, I shall treat such

interruption as obstruction to the proceedings of the Assembly and I shall take action if such things are repeated.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు : ముందు ప్రారంభించడంలోనే బిల్లు యిట్లా ఉన్నది. ఫలానా provision గురించి ఫలానా Vice-Chancellor గారి election గురించి నారాయణరెడ్డిగారు యిట్లా చెప్పారు. అది తప్పు. వారికి democracy లేదు అని చెబితే నాకు అర్థం అవుతుంది, బిల్లు విషయం పురస్కరించుకుని చెప్పితే బాగుండేది. అది అట్లా లేదనే point of order raise చేశాను.

మిస్టర్ స్పీకర్ : చెప్పవచ్చును. వారి యిష్టం.

శ్రీ ఎల్. లక్ష్మణదాస్ : వెంకటేశ్వర్లు గారికి చాల తొందర. ఏమి చెపుతారో వినకుండానే...

మిస్టర్ స్పీకర్ : మీరు వారిని criticise చేస్తారు. నేను అందరికి చక్కగా freedom of speech యిచ్చాను. అంతే తప్ప వారు మొదలు పెట్టగానే మీరు చేస్తే కష్టం.

శ్రీ ఎల్. లక్ష్మణదాస్ : ముఖ్యంగా చెన్నారెడ్డిగారు మాట్లాడుతూ పంచాయితీ బోర్డు ప్రెసిడెంట్లకు గాని, Municipal Councillors కు గాని ఎందుకు representation ఉండాలి అన్నారు. పంచాయితీ ప్రెసిడెంటు అక్కడ ఉన్న ప్రజానీకానికి ప్రతినిధులు. యూనివర్శిటీ విద్యావిధానంలో జరుగుతున్న మార్పుల విషయంలో సలహాలు యివ్వడానికి వారికి కూడా అవకాశం ఉన్నది. కేవలం పంచాయితీ బోర్డు ప్రెసిడెంటు అయినంత మాత్రాన ఆయన ఒక విశ్వవిద్యాలయంలో పట్టభద్రుడు కానంత మాత్రాన ఆయనకు విజ్ఞానం లేదు అని అవిపించుకోడానికి వీలులేదు. ఈ నాడు విద్య అన్ని రంగాలలో, అన్ని విషయాలలో అభివృద్ధి పొందవలసిన పరిస్థితులలో, విశ్వవిద్యాలయంలో పట్టభద్రుడైనంత మాత్రంలో, డాక్టరేటు వచ్చినంత మాత్రంలోను వారికే విజ్ఞానం ఉన్నది వారే దానికి representatives గాని, సామాన్య రైతులు, పంచాయితీ బోర్డు ప్రెసిడెంట్లు, మునిసిపల్ కౌన్సిలర్స్ వీళ్ళు మామూలు ఎన్నికలలో వస్తున్నారు. యిటువంటి వారికి స్థానం ఉండకూడదని చెప్పడం పొరపాటు. వారికిని విజ్ఞానం ఉన్నది. దేశంలో ఏ విధంగా విద్యనభివృద్ధి చేసుకోవాలి అనే విషయంలో కుతూహాల పడుతున్న వారు వారిలో కూడా ఉన్నారు. వారికి కూడా అన్ని రంగాలలో స్థానం యివ్వాలి. స్త్రీలకు స్థానం యిచ్చినట్లు ఎక్కడా కన్పించడం లేదు. ఈ నాడు దేశంలో ప్రధానమైనది వ్యవసాయరంగం వ్యవసాయరంగంలో scientific గా చెప్పుతున్న వ్యవసాయమే కాక, రైతులు

తమయొక్క అనుభవంతో ఎంతో పరిశ్రమచేసి వ్యవసాయాన్ని అభివృద్ధి చేస్తున్నారు. బాగా పండించి ఆదర్శప్రాయంగా ఉన్న వ్యవసాయదారులకు

[ *Sri P. V. Narasimharao in the Chair* ]

కూడా ఒకటి, రెండు స్థానాలు Senate లో యివ్వడం చాల అవసరం. ఆ body లో అన్ని వర్గాలు అన్ని రంగాలలో అభివృద్ధి కార్యక్రమాలు సాధించిన వారు వారియొక్క అనుభవం అక్కడ చెప్పుకోవచ్చు. తద్వారా విద్యలో ఏమైన మార్పులు చేయడానికి అవకాశం ఉంటుంది. Representatives విషయంలో ముఖ్యంగా agriculturists కు backward Communities కొందరికి, స్త్రీలకు దానిలో స్థానం ఉండాలి. ఈ బిల్లు చూచాను. స్త్రీలకు ఎక్కడా representation యిచ్చినట్లు లేదు.

మిగతా యూనివర్సిటీలలో హిందీకి స్థానం యిచ్చారు. కాని తిరుపతి యూనివర్సిటీలో యివ్వలేదు. ఈనాడు హిందీని దేశభాషగా చేయాలను కుంటున్నాం. తిరుపతి యూనివర్సిటీలోకూడా హిందీభాషకు స్థానం యివ్వాలి. ఎవరెవరికి representation యివ్వాలి; మొదలైన విషయాలపై Select Committee లో సమగ్రమైన నిర్ణయం చేసుకోవాలి. Senate పెద్ద body అయినంత మాత్రంలో ప్రమాదం లేదు. అన్నిటికంటె senate కు హెచ్చు అధికారాలు ఉండాలి. నేను సభ్యులందరికి మనవిచేసేది ఏమిటంటే—Vice-Chancellor Election విషయంలో యిదంతా ఏదో పెద్ద తప్పుఅని, domocracy అంతా నాశనమైపోతోందని గాని భావించనక్కలేదు. ఈనాడు దేశంలో అనేక Universities ఉన్నాయి. ఎంతో అభివృద్ధికరంగా సాగుతున్నాయి. అక్కడకూడా "మాదికదా ప్రభుత్వం. ఎవరినో తీసుకొచ్చి Vice-Chancellor గా కూర్చొపెడతా"మని చెప్పలేదు. ప్రఖ్యాతవంతులైన Chancellors నే ప్రభుత్వం వారు nominate చేస్తున్నారు. ఏ ఒక్క instance చూసుకున్నా ఎవరూ కూడా తక్కువ వారుకాదు. దేశంలో ఎంతో పేరు ప్రఖ్యాతులుపొంది విద్యారంగంలో ప్రపంచంలో ఖ్యాతిగడించినవారే అక్కడ Vice-Chancellor గా ఉన్నారు. అందుచేత మనం దీనిని ఒకపెద్దతప్పుగా భావించకుండా చిన్న మార్పులు Senate అధికారాల విషయంలోను, representation విషయంలోను ఇక్కడ ఉన్న సభ్యులు, Select Committee లో ఉండే సభ్యులు శాంతంగా ఆలోచించ వలసిందని మనవిచేస్తున్నాను. ఏ బిల్లు వచ్చినా, ఏ శాసనం వచ్చినా ఆంధ్ర తెలంగాణా అనే విభేదాలు లేకుండా ప్రతి సభ్యుడు వ్యవహరించాలి. ఆంధ్ర, తెలంగాణా అని అనుకుంటె ఎన్నో వేల సంవత్సరాలనుంచి ఆంధ్రదేశంలో

ఆంధ్ర ప్రజానీకం అంతా కలిసి ఉండాలని ఆశించి ఆనందిస్తున్న ఈ సమయంలో మళ్ళీ ఆంధ్రులు వేరు, తెలంగాణాలో ఉన్న ప్రజలు వేరు అని విరోధాలు కల్పించుకుంటె అసలు భాషాప్రయుక్త రాష్ట్రాల యొక్క స్వభావమే నాశనం అవుతుందేమోనన్న భయం ఇతర రాష్ట్రాలకు కల్పించకుండా ఆంధ్రులు ఆదర్శవంతంగా ఉండాలి. Democratic ప్రభుత్వం ఉన్నప్పుడు ఎక్కడ ఏ nomination ఉన్నా ఏమాత్రం భయపడవలసిన అవసరంలేదు. అందుచేత ఈ బిల్లును అమోదించి నేను సూచించిన చిన్న చిన్న మార్పులను గురించి యోచనచేయవలసిందని Select Committee వారిని కోరుతూ, ఈ అవకాశం లభింపచేసిన తమకు నా అభినందనలు అర్పిస్తూ విరమిస్తున్నాను.

శ్రీ బేతి కేశవరెడ్డి : అధ్యక్షా, ఈ బిల్లుపై అనేకమంది మిత్రులు మాట్లాడారు. ఈ రోజు Home Minister గారు ఏదైతే సమాధానం చెప్పారో ఆ విషయంలో నాకు తెలిసినంతవరకు తమతో మనవి చేయదలచుకున్నాను. వారు హామీలు యిచ్చిన మాట నిజం అని ఒప్పుకున్నారు. కాని ఏ సందర్భంలో హామీలు యిచ్చారో, యివ్వాళ ఈ సందర్భంలో ఏ ఏ మార్పులతో బిల్లులు తీసుకువస్తున్నది అనేది House గమనించవలసిన విషయం. వెంకటేశ్వర యూనివర్శిటీ ప్రాతిపదికమీద ఉస్మానియా యూనివర్శిటీ బిల్లు ప్రవేశపెట్టిస్తాము అని వీరు హామి యిచ్చారట. అప్పుడు Venkateswara University లో elections ఉండేవి. విద్యార్థులు మంత్రిగారిని కోరినప్పుడైతేనేమి, Vice-Chancellor ను appoint చేసినప్పుడు జరిగిన అలజడివల్లనైతేనేమి, వెంకటేశ్వర యూనివర్శిటీ ప్రకారం చేస్తామని హామీ యిచ్చారు. వీరొక వకీలు. సహజంగా వకీళ్లు ఏ పార్టీ ముందువస్తే ఆ పార్టీ వైపు fees పుచ్చుకుని వారికి అనుకూలంగా వాదన చేసేటటువంటి సంగతి తమకు తెలియనిదికాదు. తమరుకూడా వకీలే. అందుకని వారు ఈ అవకాశం ఉపయోగించుకున్నారు వకీలు కాని మినిష్టరయితే యింకో విధంగా దిగజారిపోవుదురేమో గాని వారు సక్రమంగా సమాధానం చెప్పారు. కాని sincere గా సమాధానం చెప్పలేదని నేను House ముందట ఘంటాపథంగా చెప్పదలచుకున్నాను. ఇటువంటి interpretations యిచ్చే ప్రభుత్వము ప్రజానీకానికి, ముఖ్యంగా విద్యార్థులకు ధోకా యివ్వజాలదని, వారిని అనుమానంతో పెట్టజాలదని ఈ ప్రభుత్వం గమనించవలసిఉంటుంది. వారు ఇచ్చిన హామీలను అమలులో పెట్టటానికి ఈ బిల్లులో ఏ మాత్రం సూచించబడలేదు. కాబట్టి వారు తమ రాజీనామా విషయమై పునరాలోచించాలని నేను వారిని కోరుతున్నాను. Appointment విషయంకూడా నేను తమముందు పెట్టదలచుకున్నాను. Vice-Chancellor appointment విషయంలో ముగ్గురు కమిటీ

మెంబర్లచేత panel ఏదైతే పంపబడుతుందో అందులోనుంచి ఒకరిని గవర్నరు గారు గాని, లేక Chancellor గారు గాని appoint చేయాలి అన్నారు. గవర్నరు గారికి గాని, Chancellor గారికి గాని ఈ panel లో ఉన్న ముగ్గురిలో ఏ ఒక్కరూ కూడా తమకు యిష్టంలేకపోయినట్లయితే మళ్ళీ ఈ panel ను కమిటీకి తిరిగి పంపించవచ్చు Chancellor గారికి అయితేనేమి, ప్రభుత్వము వారికయితేనేమి తమకు అనుకూలమైన పేరు వచ్చేదాక panel ను తిరిగి పంప బడే అవకాశం ఈ బిల్లులో పొందుపరచబడ్డది. ఈ బిల్లుకు అనుకూలంగా వాదన చేయడానికి సిద్ధపడేవాళ్ళను ప్రశ్నించదలచుకున్నాను. ఒకవేళ గవర్న మెంటుకు తమకు అనుకూలమైన మనిషినే ఏర్పాటుచేయాలి అనే ఉద్దేశ్యమే లేకపోయినట్లయితే తిరిగి పంపించవలసిన అవసరమే లేకుండేది. ఈ ముగ్గురిలో ఇద్దరిని సిండికేటునుంచి తీసుకువస్తారు. సిండికేటుయొక్క composition ఏవిధంగా ఉందో అనేకమంది మిత్రులు చెప్పారు. దాంట్లో elected members కంటె nominated members అధిక సంఖ్యలో నున్నారు. Nominated members అధిక సంఖ్యలో గల సిండికేటునుంచి ఇద్దరు సభ్యులను తీసుకోవాలంటే ప్రభుత్వానికి అనుకూలురైన సభ్యులు వస్తారో, అననుకూలు రైన సభ్యులు వస్తారో గమనింపవలసి యున్నది. ప్రభుత్వం ఏవ్యక్తిని Vice-Chancellor గా appoint చేయదలచుకున్నదో ఆవ్యక్తికి అనుకూలురైన ఇద్దరు సభ్యులు సిండికేటునుంచి వస్తారు. ఛాన్సలర్ చేత appoint చేయబడే 3 వ సభ్యుడు కూడా అదేదృష్టి, దృక్పథాలు గలవాడు రాక తప్పదు. ఈ ముగ్గురి లోనూవారు అనుకున్న వ్యక్తి లేకపోతే ఆ panel of names ను మళ్ళా త్రిప్పి పంపించే అవకాశం కూడా ఉన్నది. ఇది ఏవిధంగా సమగ్రంగా, సమంజసంగా ఉన్నది ? Vice-Chancelor ను appoint చేయడానికి ఇటువంటి బిల్లును తీసుకు వచ్చారు. Democracy అని అరచే నాయకులందరినీ ఇది సమంజసమేనా అని అడుగుతున్నాను. ఇది సంపూర్ణంగా డెమోక్రసీకి దెబ్బ తీయకపోయినా, అట్లా దెబ్బతీయడానికి, తోవదీయుటలో ముందడుగు వేస్తున్నదని చెప్పకతప్పదు ఇది అంతా గమనింపవలసిన విషయం. దానిపై చాలామంది మిత్రులు మాట్లాడారు- సెనేటు అయినా సిండికేటు అయినా ఒక్కొక్కటిగా తీసుకొని చూచినట్లయితే, nominations కే ఎక్కువ స్థానం ఉన్నది. Nominations అధికసంఖ్యలో ఉన్నాయి. "Nominations ఉంటే సక్రమంగా నడుస్తుంది. మంచివాళ్లనే nominate చేస్తాము" అంటే ఎట్లా విశ్వసించగల్గుతాము ? ఇదివరకు nominations ఏవిధంగా జరిగినాయో కొంతమంది మిత్రులు చెప్పారు. nominations జరిగేటప్పుడు, services లో personnel ను appoint

చేసేటప్పుడు పక్షపాతము, బంధుప్రేమ, స్నేహితుల వర్గానికి స్థానం ఇవ్వడం మున్నగునవి చూపించబడుతున్నాయి. అదేవిధంగా ఇప్పుడు జరుగుతున్నది, జరుగబోతుంది అని చెప్పకతప్పదు. దానికి మంత్రిగారు ఏమి సమాధానం ఇస్తారు ? ఈవిధంగా ఎందుకు తీసుకురావలసి వచ్చింది ? Elections లో ఏమైనా లోపం ఉన్నదా ? సిండికేటు మీద వారికి నమ్మకం లేకపోయిందా ? University నడిచే వాతావరణంలో changes తీసుకురావలసిన అవసరం ఏమి వచ్చింది ? Elections వద్దు అనడానికి కారణం ఏమిటి? వారు సమాధానం ఏమి ఇవ్వగలరు?

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు : అధ్యక్షా, నేను ఇంకా సమాధానం ఇవ్వలేదు. అదంతా వారిలోవారు ఊహించుకొంటున్నారు.

శ్రీ జేతి కేశవరెడ్డి : సమాధానం ఏమి చెబుతారు అని అడగబోతున్నాను. వారు సరిగా వినలేదు. తమ ఇష్టప్రకారం నిర్ణయించే విధంగా ఈ బిల్లును ఎందుకు తీసుకు వచ్చారు ? రేపటి ప్రభుత్వం ఎవరిది ఉంటుందో ఏమీ చెప్పలేము. ఏ ప్రభుత్వం అయినా, ఏ పార్టీది అయినా, ఏ వ్యక్తిది అయినా కూడా యూనివర్శిటీ వ్యవహారాలు సక్రమంగా నడవాలి అనే విషయాన్ని దృష్టియందుంచుకోవాలి. "మనం శాశ్వతంగా ఇక్కడనే కూర్చుంటాము. ఇదే విధంగా నడుపుతాము" అనుకొనేందుకు వీలులేదు. "పోనీ, ఉన్నవాళ్ళయినా, మన వ్యక్తులను appoint చేసుకుందామనే ధోరణి ప్రభుత్వానికి ఉండకూడదు. అది మంచిదికాదు. దానివల్ల దేశం పాడవుతుంది. కొన్నిప్రాంతాలు బాగుపడితే బాగుపడవచ్చు, కొంతమంది వ్యక్తులకు లాభకరంగా ఉంటే ఉండవచ్చు కాని ఇదిమాత్రం మంచిపద్ధతి అనిపించుకోదని మనవి చేస్తున్నాను. కొన్ని nominations సందర్భంలో ప్రభుత్వానికి యూనివర్శిటీ పరియాబయట కూడా హెచ్చు అవకాశం ఉన్నది. ఒక యూనివర్శిటీని ఒక పరియాకు కట్టుబాటుచేసి, ఇతర యూనివర్శిటీ పరియాలకు సంబంధం కలిగించడం ఎంత సమంజసమో నాకు అర్థం కావడంలేదు. ఈ సందర్భంలో ఒక ఉదాహరణ చెబుతున్నాను. ఈ యూనివర్శిటీకి బయటనుంచి వచ్చేవాటిలో, Municipalities కు 6 nominations ఉన్నాయి. మూడు వేంకటేశ్వరా యూనివర్సిటీ నుంచి, మూడు ఆంధ్ర యూనివర్శిటీనుంచి వస్తాయి. ఇక్కడ మున్సిపాలిటీలు, పంచాయతీలు కలిపి జిల్లాకొకటి elect చేసుకోవాలన్నారు. ఐతే, ఒక్క దానికి election పద్ధతి ఏమిటి? ఆరు సీట్లకు naminations పద్ధతి ఏమిటి ? దీనికి ఏమి సమాధానం చెబుతారు ? ఒకే item మీద, ఒకే పద్ధతిన nominations

పెడితే కొంతవరకూ అయినా చూచేవాళ్ళకు సమంజసంగా కనబడేదేమో! అట్లా కాకుండా ఒకే issue మీద ఒకే category నుంచి ఒకచోట nominations పద్ధతి ఏమిటి? మరొకచోట ఎన్నికల పద్ధతి ఏమిటి? ఇది ఎంతవరకూ సమంజసంగా ఉన్నది? కేవలం Vice-Chancellor యొక్క appointment మాత్రమే కాకుండా, యూనివర్శిటీ యొక్క structure, సిండికేటు యొక్క composition ఇంకా తదితర కమిటీలలో కూడా ప్రభుత్వం తమచేతిలో కర్పెమును పెట్టుకున్నది. అంతేకాక, వాటికి instructions ఇవ్వదలచుకున్నది. అంతే కాదు, Financial Committee Report గవర్నమెంటుకు పంపాలట. గవర్నమెంటు ఆడిటర్ రిపోర్టు పంపించాలట. ఇదంతా చూస్తే, యూనివర్శిటీ వ్యవహారాలన్నిటినీ ప్రభుత్వం తన చేతిలోనే పెట్టుకొని, తమ ఇష్టంవచ్చిన రీతిగా నడిపించ దలచుకొన్నట్లు తెలుస్తున్నది. ఇది సమంజసముగా లేదు. ప్రభుత్వం ఈ విషయం పునరాలోచించక తప్పదు. Select Committee కి పంపిస్తామంటున్నారు. తప్పకుండా పంపింప బడుతుంది కూడా. కాని సెలక్టు కమిటీ మెంబర్ల పేర్లు ఇచ్చినప్పుడు ఎటువంటివారిని వేసినదీ తెల్సుకొంటే, ప్రభుత్వం ఉద్దేశం ఏమిటో ఊహించ గలుగుతాము. ఈ వాదమునుబట్టి సెలక్టుకమిటీని వేస్తున్నదా? లేకపోతే "తాను పట్టిన కుందేలుకు మూడే కాళ్ళు" అన్నట్లుగా చేస్తుందా? వారు ప్రవేశపెట్టిన బిల్లును తగు విధంగా మార్చడానికి అవకాశం ఉంటే సెలక్టు కమిటీని వేస్తుందా, లేదా అనేది మనమంతా చూడవలసియున్నది సెలక్టు కమిటీలో అయినా దీని రూపాన్ని, ఇంతో, అంతో అనుకూలంగా మార్చడానికి ప్రయత్నం చేస్తారని ఆశిస్తూ నేను విరమించుకొంటున్నాను.

*శ్రీ బి. శ్రీరామమూర్తి (విజయనగరము): అధ్యక్షా! "ఇది చాలా జాగ్రత్తగా ఆలోచించి తయారుచేయబడినబిల్లు" అని మంత్రిగారు ముందుగానే చెప్పారు. ఇది ఎంతవరకు జాగ్రత్తగా ఆలోచించి తేబడిన బిల్లో స్పష్టీకరించడానికి ఒక విషయం మనవి చేస్తున్నాను. Article 3, Clause 4 లో "The headquarters of the University, shall be located at Adikimet, Hyderabad" అని స్పష్టంగా ఉన్నది. అంతేకాదు ఇంకొకటికూడా చెప్పారు. "Or in any place, within an area of 10 miles around it" అని ఉన్నది. అది ఎందుకు చేర్చినారో నాకు అర్థం కావడం లేదు. "ముఖ్యపట్టణం ఎక్కడ ఉండాలి, High court ఎక్కడ ఉండాలి" అనే వివాదాలుచాలా ఎదుర్కొన్నాము. అందుచేత యూనివర్శిటీ 10 మైళ్ళ దూరంలో ఉండవచ్చా, ఉండకూడదా అనే విషయంతో వివాదానికి ఆస్కారం లేనిపద్ధతిలో దానిని నవ

రించాలని కోరుతున్నాను. ఈ రకమైన అజాగ్రత్తలు ఇందులో ఉన్నాయి. కాబట్టి జాగ్రత్తగా పరిశీలింపబడి, నిర్ణయింపబడిన బిల్లుగా దానిని భావించడానికి వీలులేదని మనవి చేస్తున్నాను. Article 4 లో 9 వ క్లాజులో powers of the University గురించి ఉన్నది. నర్సింగరావుగారుకూడా దానిని బట్టి యూనివర్శిటీకి affiliate అయిన ఏ కాలేజీని అయినా సరే. యూనివర్శిటీనుంచి ప్రభుత్వం తీసుకోడానికి అవకాశం కల్పించారు. ఇది సరైన, న్యాయమైన క్లాజు కాదని నేను మనవిచేస్తున్నాను. ప్రభుత్వమే యూనివర్శిటీకి ఇవ్వవలసిన పరిస్థితిలో, యూనివర్శిటీక్రింద ఉన్న కాలేజీని ప్రభుత్వం తీసుకోవలసిన అవసరం ఏమి వచ్చినది? ఇది Autonomous unit గా ఉన్నది. Self-governing unit గా promote చేయడానికి ప్రభుత్వం ప్రయత్నించవలసినది పోయి, ఈరకంగా యూనివర్శిటీనుంచి తీసికొనే పద్ధతి సరైనది కాదు.

ఇంకొక క్లాజు ఉన్నది. Article 16 (b) లో "To enter into an agreement, with the Senate or Central government, or with any private management for transfering the management to any college or institution" అని స్పష్టంగా ఉన్నది.

దానినిబట్టి ఏదైనా ఒక కాలేజీని తీసుకోడానికి Central Governmentకు కూడా అవకాశం కల్పిస్తూ, ప్రత్యేకించి కొన్ని అనుమానాలకు ఆస్కారం కలిగించారు. దాని వెనుక ప్రభుత్వానికి ఏదైనా ఒక ఉద్దేశం ఉన్నదేమో అని పిస్తున్నది. కాని ఏరకమైన ఉద్దేశమూ లేకపోతే, ఇటువంటి అనుమానాస్పదమైన clause ను తక్షణం తొలగించాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను. Select Committee కి పోయినప్పుడైనా ఈ సూచనలు అంగీకరించాలి. University Charter ను మార్చాలని అనేక సందర్భాలలో కోరడం జరిగింది. అయితే, కొన్ని ఆదేశాలనూ, సిద్ధాంతాలనూ దృష్టిలో పెట్టుకొని అవి అమలులో ఉండేటట్లుగా వే Act సవరించాలని కోరడం జరిగినది. ముఖ్యంగా, మూడు రకాల సిద్ధాంతాలను మనం ఆచరించాలి. University ఏదైనప్పటికీ, promotion, dissemination of knowledge అనేది ముఖ్యలక్ష్యం. అదే రకంగా security and freedom for staff ఉండాలి. మూడవది Autonomy of the University. ప్రభుత్వం ఈ మూడింటిలోనూ అనుకూలమైన మార్పులు చేస్తే అర్థంచేసుకోవచ్చు. ఇందులో ప్రభుత్వం జోక్యం ఏమాత్రం అంగీకరించడానికి వీలులేదు, సహించడానికి అంతకన్నా వీలులేదు. వీటికి అనుకూలంగా ప్రభుత్వం ఎంతవరకూ సాగింది? మనం ఆ విషయం పరిశీలనచేయాలి. అట్లా

పరిశీలించేటప్పుడు రెండు రకాల అంశాలను మనం దృష్టిలో పెట్టుకోవాలి. 'Administration of the unit' ఒకటి 'Management of funds' మరొకటి.

Administration of the University గురించి — Vice-chancellor నియామకం ఒకటి ఈనాడున్నది. University అనేది Governing body కాదు. అదేరకంగా, Academic తాలూకు freedom and security అనేది ఎంతవరకూ ఉంచుతారో చూడాలి.

ప్రభుత్వం యూనివర్సిటీకి డబ్బు యిస్తోంది ఇంతవరకు. కాని ఈ చట్టం వల్ల, యూనివర్సిటీకి సంబంధించిన ధనంపై ప్రభుత్వం అధికారాలు తీసుకోవడము జరుగుతోంది. ఇది ఎంతమాత్రం హర్షించతగిన విషయం కాదు. యూనివర్సిటీ తాలూకు annual report ఒకటి ప్రతి సంవత్సరం ప్రభుత్వానికి submit చేయాలి అని ఉంది. ఆ రిపోర్టు ఎందుకు submit చేయాలో నాకు అర్థంకావడంలేదు. Annual accounts కూడ submit చేయాలి. ఆ అకౌంట్సు ప్రభుత్వం నిర్ణయించిన ఆడిటర్ దగ్గర ఆడిటు చేయాలని అన్నారు. ఒక financial కమిటి ఒకటి ఏర్పాటు చేస్తామని అన్నారు. దానికి Finance Dept. శక్రెటరీ, శక్రెటరీగా ఉండాలని సూచన చేశారు. ఇది సరియైన సూచనగాదు. యూనివర్సిటీకి ప్రత్యేకంగా ఒక ట్రెజరర్ పదవిని కల్పించండి. ఆ విశ్వవిద్యాలయంతాలూకు డబ్బు ఆ ట్రెజరరుద్వారా వినియోగం అయ్యేటట్లు చూడండి. ప్రతి విషయంలో ప్రభుత్వం తాలూకు యాజమాన్యంక్రింద ఉన్న, ఉద్యోగస్థులు జోక్యం కల్గించుకోవడం సరియైనదికాదని విజ్ఞప్తి చేస్తున్నాను. అదేవిధంగా Inspection and Enquiry అనే ఆర్టికల్ (8) చూచినట్లయితే అందులో స్పష్టంగా కనబడుతోంది. నిన్న ఆ విషయం ప్రభుత్వదృష్టికి తీసుకొనిరాబడింది. ఒక ముఖ్యమైన విషయం అందులో మనవిచేస్తున్నాను. "...and to cause an enquiry to be made in respect of any matter connected with the University" అనిఉంది. దీనిప్రకారం చూచినట్లయితే యిది, అది అనే రిస్ట్రిక్షన్ యేమీలేదు. యూనివర్సిటీకి సంబంధించిన ఏ విషయాన్ని అయినా ఇన్‌స్పెక్షన్ చేయవచ్చును. దానిగురించి విచారణ చేయవచ్చును. ఇటువంటి పరిపూర్ణమైన అధికారాలు తీసుకొన్నట్లయితే యూనివర్సిటీని self governing unit అని ఎలాగ భావించగలము? వాటితాలూకు స్వతంత్ర ప్రతిపత్తిని పోషించినట్లేనా? స్వతంత్ర ప్రతిపత్తిని పోషించడం కాదుకదా, దానికి వ్యతిరేకం చేయడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నదని స్పష్టంగా చెప్పవలసివస్తున్నది. యూనివర్సిటీ తాలూకు funds మీద ప్రభుత్వం అజమాయిషీని నేను ఖండిస్తున్నాను.

అప్పాయింట్ మెంటు ఆప్ వైస్ ఛాన్సలర్ గురించి తీసుకొందాము. ఇది వివాదాస్పదమైన విషయంగా పరిణమించింది. దీనిపై చాలమంది మిత్రులు మాట్లాడారు. ఈ పోస్టును నామినేషన్ ద్వారా పూర్తిచేసినట్లయితే ఒక విధంగా అర్థంచేసుకోవచ్చు. అప్పాయింట్ మెంటుద్వారా అన్నా అర్థంచేసుకోవచ్చు. గవర్నరు డైరెక్టుగా వైస్-ఛాన్సలర్ను అప్పాయింటు చేయడంలేదు. గవర్నరుచేత నియామకం అయినటువంటి ఒక మనిషి ఏ కమిటీలో ఉంటారో, ఆ కమిటీ రికమెండు చేస్తే, ఆ కమిటీ రికమెండు చేసిన పేర్లలో ఎవరో ఒకర్ని అప్పాయింటు చేయవచ్చు అని ఉన్నది ఆ విధంగా ఉన్నట్లయితే ఒకరిమీద ఒకరికి checking ఉంటుంది. ఇప్పుడు ఆ విధంగా లేదు, గవర్నరు తన తాలూకు 'నామినీని' పెడతారు. ఆ నామినీతో కలిసి ఉన్నవారు కొన్ని పేర్లను సూచిస్తారు. ఇది సరియైన విధానం కాదు. తరువాత సిండికేటునుంచి యిద్దర్ని పంపించవచ్చు అని ఉంది. "Two members to be nominated by the Syndicate from among persons who are not connected with the University or any College or recognised institution" అని ఉంది. అంటే సిండికేటు నామినేటు చేసే మనుష్యులు, ఏ కాలేజీతో, యే విశ్వవిద్యాలయంతో సంబంధం లేనటువంటివారై ఉండాలి అంటే శుద్ధ రాజకీయవాదియై ఉండాలి అన్నమాట. ఆ రాజకీయవాది అయినా ప్రభుత్వం తాలూకు మనిషి అయి కూడ ఉండాలి. వారిద్దరు గవర్నరు నామినీ కలసి, కొన్ని పేర్లను యిచ్చినట్లయితే అందులోనుంచి ఒక పేరును గవర్నరు select చేస్తారు ఆ పేరును కూడ సెలక్టు చేస్తారు అనుకోవడానికి వీలులేదు. అదికూడ సెలక్టు చేస్తారని అనుకోవడానికి వీలులేదు. ఆ ప్రక్కనే యింకో క్లాజు ఉంది, "Provided that if the Chancellor does not approve any of the persons who are elected, he may call for fresh panel from the Committee." అని తరువాతకూడ వచ్చిన పేర్లలో వారు అనుకున్న పేరు లేకపోయినట్లయితే దానిని త్రిప్పివేసి యింకో కొన్ని పేర్లను పంపమని అడగవచ్చు. దాని అర్థం ఏమటి అంటే అటు నామినేషన్ కాదు, ఇటు అప్పాయింటుమెంటు కాదు. అవతల ప్రక్కన ఎలక్షన్ కాదు. ఇది అంతా చూస్తే మసిపూసి మారేడుకాయ చెయ్యడానికి చేస్తున్న ప్రయత్నం క్రింద అర్థం అవుతున్నది. ఇంతకు ముందు మంత్రి రంగారెడ్డిగారు మాట్లాడుతూ చెప్పారు కూడ. ఒక ప్రక్కన విద్యార్థులకు యిచ్చిన హామీలను నెరవేర్చడానికి అవకాశం లేకపోతున్నదనే అనుమానంతో, అవతల ప్రక్క ఉన్న తిరుపతి విశ్వవిద్యాలయంలో, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఉన్నటువంటి పద్ధతికి దెబ్బతీసి, పూర్వ పద్ధతిని మార్చారనేది స్పష్టంగా రంగారెడ్డిగారు అంగీకరించారు.

ఇటువంటి ప్రయత్నం జరగడానికి వీలులేదు. నిజంగా వైస్-ఛాన్సలర్ ఎన్నిక సరియైన పద్ధతిలో నడిపించాలంటే అనేక పద్ధతులు ఉన్నాయి. ఈ మధ్య బెనారసు యూనివర్సిటీలో ఒక విషయం జరిగింది. నామినేటెడ్ అయిన వైస్-ఛాన్సలర్ పరిపాలన సాగిస్తున్న సందర్భంలో ఉన్నటువంటి కుళ్ళు అంతా స్పష్టంగా బయటపడింది. దాని తాలూకు పర్యవసానమే లక్ష్మణస్వామి మొదలియార్ కమిటీ వేయడం, **scandal situation** ఉన్నదని ఆ కమిటీ, తన రిపోర్టులో వ్రాయడం జరిగింది. తరువాత ప్రెసిడెంటు ఆర్డినెన్స్ జారీచేసి ప్రస్తుతం ఉన్నటువంటి యూనివర్సిటీ ఛార్టును సస్పెండు చేయడం జరిగింది. అందుచేత ఈ నామినేషన్ ఎక్కడకు దారితీస్తుందో, ఏ పర్యవసానానికి దారి తీస్తుందో, ఎటువంటి ఫలితాలు యిస్తున్నదో స్పష్టంగా తెలుస్తున్నది. ఈ విషయం ప్రభుత్వం గమనించాలని కోరుతున్నాను. ఈ ఒక్క పద్ధతేగాక అనేక పద్ధతులు ఉన్నాయి. పాట్నా యూనివర్సిటీ ఉంది. అక్కడ ఒక రకమైన పద్ధతి అమలులో ఉంది. యూనివర్సిటీలో ఉన్న ప్రొఫెసర్సు సీనియారిటీనిబట్టి, రొటేషన్ ప్రకారం వైస్-ఛాన్సలర్ అవుతూంటారు. ఒక టరమ్ మించి యింకో టరమ్ ఉండదు. ఈ రకం పద్ధతి ఒక పాట్నాలోనే కాదు. ఆక్సుఫర్డులో కేంబ్రిడ్జిలోకూడ ఉంది. అక్కడే కాదు. విదేశాలకు సంబంధించిన యూనివర్సిటీలలో ఇది ఒక పద్ధతి. ఈ పద్ధతినే యిక్కడ అమలు జరుపమని నేను అనడం లేదు కనీసం ఆ పద్ధతిని కూడ పరిశీలించమని కోరుతున్నాను. ఇంకా అనేక పద్ధతులు ఉన్నాయి ఈ రకమైన అన్ని పద్ధతులను, కూలంకషంగా చర్చించిన తరువాత, ఒక నిర్ణయం చేయమని కోరుతున్నాను. అంతేకాని ఈ నామినేషన్ పద్ధతి ఏమాత్రం పనికి రాదు. ఆంధ్ర యూనివర్సిటీలో ఉన్న ఎలక్షన్ విధానం సామాన్యంగా అందరూ అంగీకరించినవిషయం. ప్రజాస్వామ్య సూత్రాలకు అనుగుణంగా ఉన్నటువంటి విధానం. సంవత్సరాల తరబడి సక్రమంగా, విజయవంతముగా నిర్వహించబడుతున్న విద్యాసంస్థ అది. ఆ పద్ధతిని మనం ఎందుకు కాపీచేయకూడదో ప్రభుత్వం తిరిగి ఒకసారి ఆలోచించాలి. అది సక్రమమైన పద్ధతి అవుతుందేమో అనికూడ ఆలోచించాలి. ఈవిధంగా వైస్-ఛాన్సలరు నియామకాన్ని ప్రభుత్వం తన పిడికిలిలో పెట్టుకోవడం, రాజకీయ ప్రయోజనాలకోసమేనని తమద్వారా మనవి చేస్తున్నాను. పావిలాల గోపాలకృష్ణయ్యగారు మాట్లాడుతూ చెప్పారు. ఈ విధంగా వైస్-ఛాన్సలర్ పదవికి, తమ యిష్టం వచ్చినవారిని నియమించినట్లయితే డాక్టరేటు డిగ్రీ ఎవరికి యివ్వాలనేది, నిర్ణయించుకొనే అధికారం కూడ వారికి ఉంటుంది. ఫలానావారికి, డాక్టరేటు డిగ్రీ యివ్వాలని వైస్-ఛాన్సలర్ చేత చెప్పించవచ్చు. కాని ప్రస్తుతంవరకు డాక్టరేటు డిగ్రీ చాలా

అర్హతలు ఉన్నవారికే యిస్తున్నారని విన్నాను. అందుకు నాకు చాలా సంతోషమే! ఈమధ్య త్రోవలో చిన్న సంభాషణ వచ్చింది. "డాక్టరేటు యిన్ లాస్" అనే డిగ్రీస్ యిస్తున్నారు. వారికి ఏమి లాస్ "తెలుసును" అని ఒక ఆయన అడిగారు "తెలియకపోవడ మేమిటి? Son-in-law గురించి తెలుసు; brother-in-law గురించి తెలుసు; father-in-law గురించి తెలుసు" అని యింకో ఆయన సమాధానం యిచ్చారు. ఆవిధంగా అర్హతలు చూడకుండా, డిగ్రీస్ యిచ్చినట్లయితే ప్రమాదకరమైన పరిస్థితులు ఏర్పడతవి. ప్రభుత్వానికి ఉన్న విలువ మాట అటు ఉంచి యూనివర్శిటీల తాలూకు విలువలుకూడ పోతవి. ఏ రకమైన రాజకీయ అభిప్రాయాలు యూనివర్శిటీలలో ప్రవేశించరాదని నేను మనవి చేస్తున్నాను. ఈ మధ్య ఉస్మానియా యూనివర్శిటీలో శ్రీ వి. కె. కృష్ణమీనన్ కాన్వకేషన్ అడ్రసు యిస్తూ, రాజకీయ ప్రమేయం లేనటువంటి యూనివర్శిటి నిర్వహణకావాలని ప్రబోధము చేస్తున్న సందర్భంలో ఒక చిన్న సంఘటన జరిగింది. రాజకీయాలతో యూనివర్శిటీలకు సంబంధం ఉండకూడదని అంటూ, మరుక్షణం ప్రక్కన ఉన్న సంజీవరెడ్డి. డి. యస్. రెడ్డిగార్లవైపు చూచారు. విద్యామంత్రిగారివైపు చూచారని నేను అనను. అక్కడ ఉన్న వారందరూ ఏమి అర్థం చేసుకొన్నారంటే 'ఈ సంగతి బహుశ కృష్ణమీనను గారికికూడ అర్థం అయి ఉంటుంది' అనుకొన్నారు.

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు : ఏమి జరిగింది ?

శ్రీ బి. శ్రీరామమూర్తి : మొన్న కాన్వకేషన్ అడ్రసు శ్రీ వి. కె. కృష్ణమీనన్ యిచ్చారు. ఆ యిచ్చిన సందర్భంలో యూనివర్శిటీలకు రాజకీయాలతో సంబంధం ఉండకూడదని, రాజకీయాలతో సంబంధంలేని నిర్వహణ కావాలని అంటూ మరుక్షణం శ్రీ సంజీవరెడ్డిగారివైపు, డి. యస్. రెడ్డిగారివైపు చూచారని నేను అన్నాను. మంత్రిగారివైపు చూచినట్లు నేను చెప్పలేదు.

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు : శ్రీరామమూర్తిగారు ఊహించుకుంటున్నారు. వారు చాల పెద్ద ఊహాగానంలో ఉన్నారు. నేను అంతకంటె ఏమీ చెప్పలేను, ఛాన్సలర్, వైస్ చాన్సలర్ ముఖాలవైపు చూడకపోతే, నాముఖంవైపు, శ్రీరామమూర్తిగారి ముఖంవైపు చూస్తారా ?

శ్రీ బి. శ్రీరామమూర్తి : నావైపు చూడనక్కరలేదు, మీవైపుకూడ చూడలేదని అంటున్నాను.

శ్రీ పి. వరసింగరావు : వారికి ఊహించుకొనే అధికారం లేదని చెప్పటానికి మంత్రిగారికి హక్కు ఉన్నదా ?

శ్రీ ఎస్. బి. పి. పట్టాభిరామారావు : ఊహించుకోవచ్చు, కాని ఆవిధంగా ఇంటర్ ప్రెట్ చేయడం న్యాయంకాదు.

శ్రీ బి. శ్రీరామమూర్తి: అది అక్కడ ఉన్నటువంటి వారి అభిప్రాయం. నా అభిప్రాయం కూడ అదే! అక్కడ చూచినటువంటి సంఘటనను మనవిచేశాను.

ఇక యూనివర్శిటీ స్టాఫ్ గురించి ఒక విషయం చెప్పదలచుకొన్నాను. ఆ స్టాఫ్ తాలూకు security, freedom గురించి ప్రత్యేకమైన అవకాశాలు ఈ చట్టంలో కల్పించినట్లయితే బాగుండేది. దురదృష్టవశాత్తు మన దేశంలో Academicians తాలూకు స్వాతంత్ర్యం మట్టుకు సంకుచితపరచడం జరుగుతోంది. ఉదాహరణకు బొంబాయి యూనివర్శిటీలో పేరుపొందినటువంటి పొలిటికల్ ఫిలాసఫర్‌గా పనిచేస్తున్నటువంటి శ్రీ డి. పి. ముఖర్జీని డిస్‌మిస్ చేయడం జరిగింది. ఈమధ్యనే ఉస్మానియా యూనివర్శిటీలో సంఘీ అనే ఆయన ఎన్నికలలో పోటీచేయడం, suspend కావడం మనకు తెలిసినవిషయమే. ఇటువంటి పనులు జరుగుతున్నప్పుడు మొట్టమొదట ఉన్న క్లాజులో ఆర్టికిల్ (6) లోనే మనం కొన్ని ఏర్పాట్లు చేసుకోవాలి. రావి నారాయణరెడ్డి గారు ఈవిషయం గురించి చెప్పి ఉన్నారు. University open to all persons and creeds అన్నచోట place of birth అనేదానిని కూడ కలిపి, political opinion కు కూడ స్వేచ్ఛఇవ్వాలి. అవకాశం యివ్వాలి. దీనినికూడ అందులో చేర్చడం అవసరం.

మరాట్వాడా బిల్లు చూచిన, అందులో ఆర్బిట్రేషన్ అనే ప్రిన్సిపుల్‌కు ఎక్కువ అవకాశాన్ని కల్పించారు. యూనివర్సిటీ staff కు management కు మధ్య వివాదం జరిగిన ఆర్బిట్రేషన్‌కు అవకాశ ముండాలి. అలాంటి అవకాశాన్ని ఇక్కడకూడ కల్పించాలని కోరుతున్నాను. Composition of governing bodies చూద్దాము. ప్రస్తుతం సిండికేట్‌లోని 13 సభ్యులలో ముగ్గురు మాత్రము ఎకడమిక్‌వా రున్నారు. పూర్వం 16 లో పదిమంది ఉండేవారు. అలాగే ఎకడమిక్ కౌన్సిల్‌లో టీచర్సుకు, లెక్చరర్సుకు, రీడర్సుకు తగినంత ప్రాతినిధ్యం కల్పించబడలేదు. ఇదేవిధంగా ఫ్యాకల్టీస్ విషయంలో ప్రతి ఫ్యాకల్టీని నామినేషన్ చేయడం రొటేషన్ పద్ధతి ప్రకారం ఏర్పాటు చేయాలి. అందుచేత సిండికేట్‌లో గాని, ఎకడమిక్ కౌన్సిల్‌లో గాని మరే ఇతర సంస్థలలో గాని సభ్యత్వాన్ని చూచినప్పుడు మనకు ఒక విషయం కనడుతుంది. Ex. Officials ను ముందు తీసుకుందాము. ఫైనాన్సు సెక్రటరి ఇందులో ఉంటారు. ఎడ్యుకేషన్ సెక్రటరి ఉంటారు. విద్యాశాఖ డైరెక్టరు ఉంటారు.

Heads of departments ఇందులో ఉంటారు. కాని యూనివర్శిటి ప్రొఫెసర్సుకు సరియైన place లేదు. Larger academic interests represent చేయడమే లక్ష్యమని వారన్నారు. Larger academic interests ఏ విధంగా represent ఔతున్నాయో మనకు ఈషన్మాత్రమూ తెలియకుండా ఉన్నది. అంతేకాదు. పదివేల రూపాయలకు మించి విరాళమిచ్చినవారందరికి ఇందులో అవకాశం కలుగుతున్నది. ఆ విధంగా వారికి సభ్యత్వమివ్వడం చాలా మంచిదని మంత్రి గారు చెప్పవచ్చును. కాని నాకు ఒక అనుమానమున్నది. యూనివర్సిటీకి విరాళ మిచ్చిన వారికి స్థానమున్నప్పుడు, దాని affiliated colleges కు విరాళమిచ్చినవారికి స్థానముండవలసిన అవసరం లేదా? వారికికూడ ప్రాతినిధ్యం ఉంటుందని చెప్పినా చెప్పవచ్చును. కనీసం ఇక్కడైనా election principle పెట్టండి. ఆ రకంగా వచ్చినవారు కేవలం Honorary Senators గా మాత్రం ఉంచండి. ఓటు హక్కు లేకుండా చేయండి. ఓటు అధికారం కూడ ఇవ్వదలచుకొన్న ఆ విధంగా విరాళమిచ్చి సెనెటర్సుగా వచ్చినవారిలో పోటీ పెట్టి ఇద్దరికో; ముగ్గురికో మాత్రం ప్రాతినిధ్యం ఇప్పించండి. కొంతకాలం అమలుచేసి చూచిన దాని మంచి చెడుగులు తెలుస్తవి. ఇప్పటి సెనెట్ కాంపోజిషన్ చూచిన అందులో ఎన్నిక ద్వారా 12 మంది, గవర్నరు నామినేషన్ ద్వారా 16 మంది వస్తారు. 12 మందిలో రిజిష్టర్డు గ్రాడ్యుయేట్సు ద్వారా ఆరుగురు; ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీద్వారా అయిదుగురు; మునిసిపల్ కమిటీనుండి ఒకరు ఎన్నిక ఔతారు. Scheduled Castes నుండి, Scheduled Tribes నుండి, Teachers వగైరా తరగతులనుండి ఆ 16 మంది నామినేట్ ఔతారు. అందువల్ల ఎన్నికకంటె నామినేషన్ కే ఎక్కువ ప్రాధాన్యత ఉన్నది. Academic interests కంటె ధనమున్న మనుష్యులకే హెచ్చుప్రాధాన్యత ఉన్నది. ఇందులో సామాన్యమైన ప్రజాస్వామిక సూత్రమగు ఎన్నిక పద్ధతి నిర్లిప్తం చేయబడింది. యూనివర్శిటీ ప్రధాన లక్ష్యమగు అటానమీకి భంగం కలిగింది. Political interference ప్రతినిత్యం ఉండుటకు అవకాశం కలిగింది. యూనివర్శిటీని ప్రభుత్వ affiliated సంస్థ క్రింద ఏర్పాటుచేశారు. అందుచేత ఈ బిల్లు అంతా చదివిన తరువాత ప్రభుత్వమనే జబ్బుతో యూనివర్శిటీలు శాశ్వతంగా బాధపడవలసిన దుస్థితి ఏర్పడుతుందని భయపడుతూ దీనిని వ్యతిరేకిస్తున్నాను.

**श्री बसवा मानैया :** जनाबे सदर के तवस्सुत से मैं हाउस के सामने अपने खयालात रखना चाहता हूँ। उसमानिया युनिवर्सिटी के बिल के नाम से जो आंध्र युनिवर्सिटी और व्यंकटेश्वर युनिवर्सिटी बिल्स भी इसके अन्दर लाकर यहाँ हमारे सामने रखे गये हैं उस से ऐसा मालूम होता है कि ८ डिसम्बर १९४७ को निजाम साहब

ने फ़रमान के ज़रये चार्टर रखा था आज यह हुकूमत उसी को एक बिल का नाम देकर उसका बोर्ड बदलकर इस हाउस के सामने पेश कर रही है। श्री गोपालराव एकबोटेजी ने तो इस से बढ़कर यह फ़रमाया कि यह बिल तो उससे फ़रसूदा है। और निज़ाम के उस फ़रमान से भी पीछे है।

दूसरी चीज़ मै हुकूमत को जो बतलना चाहता हूँ वह यह है कि हुकूमत से ताल्लुक रखने वाले अराकीन ने भी जिन खयालात का इज़हार किया उन में से अगर लफ्ज़ "ताईद" निकाल दिया जाय तो मालूम होगा कि उन्हों ने इन बिल्स को अपोजीशन से बढ़कर क्रिटिसाइज किया है। इसके अन्दर जितनी खराबियां हैं वह बिलकुल सामने आ चुकी हैं। मुझे इस से ज्यादा अलफ़ाज़ बतलाने की ज़रूरत नहीं है। यह एक ऐसा क़िस्सा है कि श्री डी. एस. रेड्डी को व्हाइस् चांस्लरी पर लाने के बाद यहाँ के तमाम तलबा और यहाँ के बड़े बड़े मुदब्बेरीन ने हुकूमत से मुतालिबा किया था और उस वक्त हमारे होम मिनिस्टर साहब ने तमाम लोगों से वादा किया था कि आंध्र में जिस तरह से व्हाइस चांस्लर के एलेक्शन का तरीका है उसी तरह यहां भी वह एलेक्शन का तरीक़ा रायेज करवायेंगे। ऐसा नहीं कहा था कि वहाँ जैसा है यहाँ भी वैसा ही करवायेंगे। इस पर मुझे वह क़िस्सा याद आता है कि बन्दर जब रोटियों को तकसीम करने के लिए बैठा तो जिधर ज्यादा है उधर से चट करता हुआ पूरी रोटी खा गया। उस वक्त तो तेलंगाना के हुकूक की हिफ़ाज़त का नारा बलन्द करके दिल्ली भागे भागे फ़िरे और इस तरह केबीनेट में आगये। उसके बाद यहाँ के लोगों से उन्होंने जो वादा किया था कि आंध्र की तरह यहाँ भी वाइस चांस्लर के तकर्रुर में एलेक्शन का तरीक़ा रखेंगे आज उनकी तक़रीर सुनकर हमको ताज्जुब होता है। अपनी तक़रीर में उन्होंने अपने वादे का एक़रार तो किया लेकिन इसपर उन्होंने मनतिक़ की जिससे वह और भी पूरी तरह से बन्ध गये। पहले निज़ामुल मुल्क आसफ़जाह अव्वल को यहा का सूबेदार बनाकर भेजा गया था और वह यहाँ आकर खुद मुखतारी का एलान कर दिये उसी तरह आज वह केबीनेट में जाने के बाद बिल्कुल आंध्र बन गये हैं- यह उनकी हर तरीके से ग़लत सलत तरीके पर सारी चीज़ों की ताईद कर रहे हैं या उन्होंने ताईद करने की खुल्लम खुल्ला कोशिश की। आपने कहा था कि अगर आप अपने वादे को पूरा न करें तो इस्तेफ़ा दे देंगे। आज दूसरे लोग पूछने से पहले ही आपको अपना इस्तेफ़ा पेश कर देना चाहिये था। उसमानिया युनिवर्सिटी का मामेला तेलंगाने से संबंध रखता है इसको आपने रीजनल कमेटी में तक लाने की कोशिश नहीं की। या इसकी हिम्मत नहीं की। इससे सेनेट को बड़े वसी एख्तियारात हैं डिग्रीज देना, इन्तेज़ामी मामले तय करना, लोगों को मुक़र्रर करना, तक़र्रुरात करना इन सब चीज़ों का एख्तियार सेनेट को ही है। लेकिन इस सेनेट में हम देखते हैं कि लोग तीन हज़ार पांच हज़ार पच्चीस हज़ार रुपये देकर आ जा सकते हैं। और वह मेजारिटी हासिल कर ले सकते हैं। इस तरह से इस सेनेट में सरमायादारों को बिठाने का सस्ता बिजिनेस रखा गया है। हमारे वज़ीरे तालीम का यह कहना है कि हम एक तरक्की पज़ीर बिल आपके सामने रख रहे हैं। लेकिन एसा तरीक़ा न तो किसी फ़ारन कनटरी में है और न हिन्दुस्तान के किसी कोने

में रायेज है। कई उमूर के बारे में बतलाया गया कि यह बिल गुलत तरीक़े पर आया है। इसमें हमारे इज्जत मआब राधा कृष्णन् की राय को भी जो युनिवर्सिटीज के ताल्लुक से है बालाये ताक़ रखा गया है। बल्कि उसको घी में गिरी हुई मख्खी की तरह से निकाल क़र फेक दिया गया है। इसमें बाहेर वालों की मेजारिटी रखी गई है। इसकी क्या वजह है? ऐसा क्यों किया जा रहा है? इस संबंध में कई टीचर्स यूनियंस और तलबा की यूनियंस की नुमाइंदगियां हुकूमत के सामने आचुकी हैं कि यह बिल कैसा होना चाहिये। लेकिन हुकूमत ने किसी नुमाइंदगी को क़ुबूल नहीं किया है। और न इसमें किसी किस्म की तबदीली की है। सिर्फ आबजेक्ट्स अण्ड रीज़ंस में यह लिख दिया गया है कि हमने सारी चीज़ों को सुनने के बाद उसपर ग़ौर करके उसमें थोड़ी बहुत तबदीलियाँ करके इस बिल को पेश किया है। लेकिन हम इस बिल में देखते हैं कि एक कदम भी आगे नहीं उठाया गया है। एक लफ्ज़ भी प्रोग्रेसिव नहीं है। हुकूमत के जिम्मेदार वुज़रा से जब मुरासलत की जाती है तो उन्हें "आनेरेबल" न लिखने के बारे में जी. ओ. है। लेकिन यहाँ निज़ाम साहब के लिए "महा घंणावर्हिंचेना हाई नेस" के अलफ़ाज़ इस्तेमाल किये गये हैं। वह कितने महा महान हैं यह तेलंगाना के सब लोगों को मालूम है। उनको इतना बढ़ाकर यहाँ लिखने की क्या जरूरत है? इन तमाम वाकेआत को सामने रखते हुए जब व्यंकटेश्वर युनिवर्सिटी और आंध्र युनिअर्सिटी के इन्तेजाम और उसमानियाँ युनिवर्सिटी के इन्तेजामात को एक लेवल पर लाने का जो ढोंग रचा गया है वह खुल्ला होजाता है। व्हाइस चांस्लर के मुताल्लेक अव्वाम ने बड़ी कोशिश के साथ एक इन्क़लाबी पहलू हुकूमत के सामने रखा तो उस वक्त उनको यह समझाया गया कि जिस तरह से व्यंकटेश्वर युनिवर्सिटी के व्हाइस चांस्लर के इन्तेख़ाब का तरीक़ा है वैसे यहाँ भी हो जायगा उसके लिए कुछ दिन ठैरिये इस के लिए बिल आ रहा है। उस वक्त तो यह समझाया गया। और जब यहाँ बिल आता है तो कुछ और पेश करके उस पर मनतक़ की जाती है उसकी वकालत की जाती है इस वकालत को लोग देखेंगे अखबारात देखेंगे। दुनिया देखेगी। इसको नज़र अन्दाज नहीं किया जा सकता। यह सिर्फ मनतक़ी नुक़ते नज़र से कहा जारहा है कि अब आंध्र में भी नामिनेटेड तरीक़ा हो गया है यहाँ भी नामिनेटेड तकर्रुर का सिस्टम रखा जा रहा है। पहले तो इंतेखाबात के लिये खुल्लम खुल्ला वादा किया गया वह चीज़ रिकार्ड पर मौजूद है। अखबारात में है हुकूमत के पास है और दुनिया के सामने है। यह नेगोसियेशंस में है। अब उसको ठुकराकर उसको रद्द करके अनडेमोक्रेटिक तरीक़े पर और ग़ैर जिम्मेदाराना तरीक़े पर पीछे खींचने की कोशिश की जा रही है। यह कोशिश मुल्क के हालात और तेलंगाने के हालात के लिये बहुत ही खतरनाक साबित होगी। क्यूँकि यह अपने लोगों को आगे लेजाने कि कोशिश है अपने मफादाते हासिला को गुलत तौर पर बरक़रार रखने की कोशिश है। यह यहाँ के लोगों के लिये नाक़ाबिले बरदाश्त है। शर्मनाक मामलों में इसका इंदराज किया जाता है। आखिर वजह क्या है कि ऐसा किया जारहा है। आप अव्वाम से वादा किये हैं आपको यहां अव्वाम की नुमाइंदगी के लिये भेजा

गया है। उनके हुकूक़ की हिफ़ाजत के लिये आप भेजे गये है। आप यहां अपने मफादाते हासिला की हिफाजत ही के लिये नहीं भेजे गये हैं। जिस तरह से कि फरसूदा हुकूमतों में शखसी हुकमरां अपने मफादाते हासिला की हिफ़ाजत कर लेते है और उसके लिये अपने हथकन्डे इस्तेमाल करते है। यह हुकूमत तो अव्वाम की नुमाइंदगी करने का दावा करती है। फिर इसमें वैसी ही बाते सिर्फ़ नाम बदल कर प्लेट बदलकर मोड तोड कर पालिश करके हमारे सामने पेश कर रही है। यह नाजायोज़ कोशिश टिकाने वाली नहीं है। इन बातो को दूर करने की कोशिश की जानी चाहिये जिससे हुकूमत मजबूत हो और अव्वाम को भी इतमेनान हो और अमन बरक़रार रह सके। आपके सामने श्री चेन्ना रेड्डी और श्री गोपाल राव एकबोटे जैसे जिम्मेदार लोग जो हुकूमत में काम किये हुवे है और काफ़ी तजरुबाकार हैं उन्होने बतलाया कि इस में कितनी खराबिया है और कितनी ग़लतियां हैं। कई मेंबर्स ने बतलाया कि इस बिल के पीछे कई ग़लत-कारियां हैं और इसमें कई बुराइयां है। और अव्वाम पर इसका बुरा असर पड़ेगा। यह बतलाया गया कि युनिवर्सिटी के एख्तियारात में किस तरह से मदाखेलत करने की कोशिश हो रही है। आप किस तरह सेंट्रलाइजेशन की तरफ़ जा रहे है। ज़बानी तो यह कहा जाता है कि विकेन्द्रीकरन करेंगे। इन तमाम बातों को सामने रखते हुवे अकान की राय औरउनकी तंबीह का सामने रखते हुवे आप आगे क़दम उठायें। जो खयालात जाहेर किये गये हैं वह बहुत काफ़ी हैं कम से कम अब संभल जायें। और विशाल हृदय से अपने आत्मा का विमर्श करके इसपर विचार करें। सोचें कि आखिर क्यों हुकूमत की ताईद करनेवाले भी सेंट पर सेंट इसकी बुराइयों को बयान कर रहे हैं और इसको दुरुस्त करने के लिये कह रहे हैं। अपोजीशन के लोगों ने भी इसकी मुखालेफ़त की और हर पार्टी के मेंबर्स ने भी इसको बुरा कहा। कांग्रेस के लोग भी इसको बुरा कह रहे हैं और यह बात उनकी तकरीरों में से लफ़्ज़ "ताईद" की दुम को निकाल दिया जाये तो वाजेह हो जाती है। इस तरह सेंट पर सेंट मेंबर्स ने आपको कहा कि रुक जाओ। सोचो समझो वर्ना यह ट्रेन पटरियों से गिर जायेगी। मैं हुकूमत को मुतनब्बेह करना चाहता हूं कि वह इन बातों पर सब कमेटी में विचार करे और अपने ख्याल को बदल डाले। और इस कमेटी में युनिवर्सिटी के एखतियारात के सिलसिले में और अपाइंटमेंट के लिये जो नामिनेशन का तरीका है उसको निकाल दिया जाये। और वहां के टीचर्स प्रेजवेट्स और अधिकारियों के इंतेजामात में एखतियारात देकर जमहूरियत को आगे बढ़ाने की कोशिश की जाये।

मैं इन खयालात के साथ आपका शुक्रिया अदा करते हुए अपनी तकरीर खतम करता हूं।

శ్రీ పి. సత్యనారాయణ : అధ్యక్షా, విద్యాశాఖ మంత్రిగారు ప్రతిపాదించిన యీ మూడు బిల్లులకూ పునాది అంశం ఒక్కటే, అయితే మంత్రిగారు— ఒక Experts' Committee ఈ విషయాలన్నిటినీ పరిశీలించి వారు ప్రభుత్వా

నికి సలహాయిచ్చినట్లున్నూ, ప్రభుత్వం ఆ సలహాను పురస్కరించుకొని ఈమూడు బిల్లులను రూపొందించినట్లు తెలిపారు. కాని **Experts' Committee Report** మాత్రం సభముందు పెట్టలేదు. ఈవిధంగా **Experts' Committee Report** ను శాసనసభ ముందుకు రానీయకపోవడం అనేది, తెలియక అమాయకంగా చేసిన పని మాత్రం కాదని నేను మనవిచేయక తప్పదు. ఈ విషయంలో ప్రభుత్వపక్షానికి, ప్రతిపక్షానికేగాక— ప్రభుత్వపక్షంలోనే రాజీ కుదరడం లేదు. **Experts' Committee Report** ను యింతవరకు బయటపెట్టకపోవడం చూస్తే యీ విషయంలో మంత్రిగారిని అనుమానించకతప్పడంలేదు. ఈ **Experts' Committee**లో కేవలం యూనివర్శిటీల వైస్‌ఛాన్సలర్సేగాకుండా, **Education Department Heads** ను, మంత్రివర్గంలో విద్యాశాఖను నడిపేవారిని, యింకా యితర అనుభవజ్ఞులను కూడా సభ్యులుగా తీసుకున్నారు. వారు ఎంత కఠినంగా తమ **dissent** ను తెలిపారో ప్రజలకు తెలియజేయవలసిన నైతిక పూచీ ప్రభుత్వానికి ఉన్నది.

అంతేకాదు. ప్రభుత్వము యీనాడు ఎంత బలహీనమైన స్థానం మీద నిలబడివున్నదో గమనించవలసియున్నది. అందులో ఆ కమిటీ **report** తమను బలపరచలేకపోవడం కూడా ఒక అంశం అవుతుంది. తరువాత ఈ మూడు బిల్లులనూ పరిశీలించి చర్చించమని విశ్వవిద్యాలయాలను ప్రత్యేకంగా సమావేశపరచమని ప్రభుత్వం కోరింది. 'దానికి చాలా డబ్బు ఖర్చుఅవుతుంది, మేము ఆవిధంగా చేయం' అని వారన్నారు. అప్పుడు దాని కయ్యే ఖర్చునంతా తానే భరిస్తానన్నది ప్రభుత్వం. ఆ తరువాత వారు సమావేశమయ్యారు. సమావేశమై చేసిన తీర్మానమేమిటి? వెనుకటి ఎన్నికల పద్ధతినే యికముందు కూడా **continue** చేయవలయునని, మళ్ళీ **selections, nominations** మాత్రం పనికి రావని వారు ఏకగ్రీవంగా తీర్మానించి, ప్రభుత్వానికి తెలియపరిచారు. అది ప్రభుత్వం యొక్క రెండవ బలహీనత. యీ సందర్భంలో మంత్రిగారికి నేనొక ప్రశ్న వేయదలచుకున్నాను. రాధాకృష్ణన్ కమిటీ రిపోర్టు ఎప్పుడు వచ్చింది? అది 1948 వ సంవత్సరంలో వచ్చింది కాని 1957 వ సంవత్సరం డిశంబరు 31 వ తేదివరకు **election** పద్ధతి మంచిదని **Senate** లో **assert** చేస్తూ మంత్రి గారు మాట్లాడారా? లేదా; మాట్లాడారు. 1948 వ సంవత్సరంలో రాధాకృష్ణన్ కమిటీ రిపోర్టు రాగా— ఎలక్షన్స్ ఉత్తమపద్ధతి అని యావద్భారత దేశానికి ఒక శిఫార్సు వారు చేసివుండగా మొన్న 1958వ సం.లో హైదరాబాదులో **students** ఉద్యమం బయలుదేరినప్పుడు అది మనసులో పెట్టుకొని, రాధాకృష్ణన్ కమిటీ రిపోర్టును దృష్టిలో పెట్టుకుని, ఎలక్షన్ పద్ధతిని ప్రభుత్వం

అమలుపరచితీరుతుందని, ఆవిధంగా అమలుజరగని పక్షంలో తాను రాజీనామా నిస్తానని విద్యామంత్రిగారి తరఫున మరొక మంత్రిగారు వాగ్దానం యివ్వడం జరిగింది. దాని యొక్క పర్యవసాన మేమిటి? ప్రభుత్వ దృక్పథాన్ని పరిశీలిస్తే అందులో democracy అనేదాని కేమీ అర్థం కనబడడం లేదు; democracy consideration లేదు; education consideration అంతకంటే లేదు. ఇంక యిందులో మిగిలింది ఒక్క political consideration మాత్రమే. ఈ political consideration లో ఒక master stroke ను పెడదామనుకుంది ప్రభుత్వము. ప్రతిపక్షానికి, ప్రభుత్వ పక్షానికీ మధ్య వుండే వైరుధ్యం కొంత, ప్రభుత్వపక్షం లోనే ఒక వర్గానికీ, మరొక వర్గానికీ మధ్యవుండే వైరుధ్యం కొంత; వీటన్నింటి పరిష్కారం కోసం master stroke ను ఏర్పాటుచేయాలని ప్రభుత్వం ఊహించి వుండవచ్చు.

తెలంగాణాలో ప్రో చాన్సలర్‌ను గురించి సందేహిస్తున్నారు కదా! దానిని తీసివేద్దామనుకుని effective clause కాదుకదా అని తీసివేసినారు. మిగతా విశ్వవిద్యాలయాలకు సంబంధించి తీసివేసినారా అంటే తీసివేయలేదు. పైగా ఇతర విశ్వవిద్యాలయాలలో ఎన్నిక (election) పద్ధతి ఉండగా ఇక్కడ ఎందుకు నియామక (nomination) పద్ధతిని పెట్టారని అడుగుతారని అక్కడకూడా తీసివేద్దామనుకున్నారు. ఈవిధంగా చేసినట్లయితే తమపార్టీలో maximum unity ని సంపాదించుకోవచ్చునని అనుకున్నారు. కొంతవరకు ఆ ఆశయం సాధించబడ్డదేమో అనిపించిందికూడా, నిన్న ఎక్బోటే, వినాయక్ రావుగార్ల ఉపన్యాసాలను విన్నతరువాత. కాని ఈరోజు పరిస్థితి చూస్తే క్రొత్త చిత్రం మన ఎదురుగా తయారైనది. రాజకీయంగా వారు వేసిన ఎత్తుకూడా పూర్తి ఫలితాన్ని ఇవ్వలేదనే విషయాన్ని గుర్తించి ప్రభుత్వం ఒక అడుగు వెనుకకు వేయడం మంచిదని అభిప్రాయ పడుతున్నాము. ఎన్నడూ ఇదివరకు లేనిది వైస్ చాన్సలర్ పదవి దేతకార్చన పెట్టేకదా, దానిని కదుపకూడదు. సామాన్యమానవుల ఎన్నికల రొంపిలోనికి దింపకూడదు అని అంటున్నారు. రాజకీయవేత్తలు ఇటువంటి వైఖరిని తమకు అనుకూలమైన సమయాలలో తీసుకోడం, అనుకూలం కాని సమయాలలో తీసుకోవకపోవడం; అనుకూలమైన విశ్వవిద్యాలయముల సందర్భంలో తీసుకోవడం, అనుకూలం కాని విశ్వవిద్యాలయాల సందర్భలో తీసుకోనకపోవడం గమనించవలసియున్నది. ఏమైనా ఈ వైఖరి కొంతమంది విద్యావేత్తలు, ముఖ్యంగా తెలంగాణాలోని విద్యావేత్తలు, అవలంబిస్తున్నట్లు కనుపిస్తున్నది, వారిచాటున మంత్రివర్గం దాగుకొనవచ్చును. ఈ విషయంలో కొంచెం లోతుకు వెళ్ళవలసియున్నది. రాధాకృష్ణన్

కమిటీ విచారణ చేసినపుడు ఎంతమంది విద్యావేత్తలు ఎన్నిక కావాలని సాక్ష్యం ఇచ్చారు? చాలామంది ఇచ్చారు. ఈ విషయమై రాధాకృష్ణన్ కమిటీలోనే ఎంత అభిప్రాయభేదం ఉన్నది ? చాలా భేదం ఉన్నది. ఈరోజున మరొక పరిస్థితికూడా ఏర్పడినది. 1948 వ సంవత్సరపు ఇండియా వేరు. 1958 వ సంవత్సరపు ఇండియా వేరు. పునాదిలోనే మార్పులు చాలా జరిగాయి. మన దృక్పథం మారింది. మన లక్ష్యం కొంతవరకు నిర్వచించ బడినది. మన విధానం కొంతవరకు నిర్వచించబడినది. ఈరోజున ఆ రాధాకృష్ణన్ కమిటీనే అదే subject మీద రిపోర్టును ఇమ్మని అడిగితే అదేవిధంగా వ్రాస్తారని మనమెవ్వరమూ అనుకోముకదా! చిన్నచిన్న అభిప్రాయభేదాలనే కాదు; చాలా పునాది మార్పులనే ఈనాడు పొందుపరుస్తారు. 1948 లో భారతదేశానికి plan mind లేదు. ఈరోజున plan mind వచ్చినది. దీనిని విద్యావేత్తలు గమనించకుండా ఉండలేరు. ఈ direction లో విద్యను నడిపించకుండా ఉండలేరు, 1948 లో pattern ను నిర్వచించలేదు; ఈరోజున pattern నిర్వచించినారు; Socialist pattern అని నిర్వచించినారు. ఎంతవరకు అమలు జరుపుతారన్న విషయం ఎవరు అమలు జరుపుతార్న విషయం అట్లా ఉంచండి. మొత్తంమీద ఇండియా పార్లమెంటు ప్లానుతోపాటు pattern ను కూడా నిర్వచనం చేసింది. వీటిని మనస్సులో పెట్టుకోకుండా ఏదో ఒక రకమైన ivory towers మధ్య కూర్చునే professoinal attitude ఈనాడు చెల్లనేరదు. ఇది ఒక argument ద్వారానే కాదు. కేవలం వీటికి ఒకరకమైన కాలదోషం ఇచ్చిందని మనం గ్రహించవలసి ఉంటుంది. సమాజంలోని అన్నిసమస్యలను పురస్కరించుకునే విద్యా సమస్యకు ఒక రూపం వస్తుంది. సమాజంలోని అన్ని సమస్యలు పరిష్కరించబడుతుంటే విద్యలోని crisis కొంతవరకు పరిష్కరింపబడుతూ ఉంటుంది. సమాజ పరిస్థితులు వినా విద్యపట్ల మనం ఒక ప్రత్యేక utopian policy ని రూపొందించుకోనలేమని నేను మనవిచేస్తున్నది మంత్రులకుకాదు- ఈ సిద్ధాంతం వెనుకఉన్న విద్యావేత్తలకు సవినయంగా మనవిచేస్తున్నాను. రాధాకృష్ణన్ కమిటీకూడా సగానికి సగం పద్ధతిని అంగీకరించినది. Internal membership కు external membership కు ఒకరకమైన equal weightage ఉంటే ఒక ప్రక్క academic interest కు మరొకప్రక్క democratic control కు చక్కటి balance ఉంటుందనే ప్రాతిపదికమీద వారు సిఫార్సులు చేసినారు. వాటిని ఈరోజున మేము గట్టిగా తిరస్కరించవలసిన అవసరంలేదు. కొంతవరకు ఆ అభిప్రాయంతో compromise కావచ్చును. ఒక వేళ అభిప్రాయ

భేదాలున్నా అవి స్వల్పమైనవి కనుక అంత పట్టింపు అవసరంలేదు. Democratic element ఇందులో ఎంత ఉండాలి ; Academic element ఇందులో ఎంత ఉండాలి ; Government element ఇందులో ఎంత ఉండాలి ? మూడూ ఉన్నాయి. నిన్న ఈరోజున మాట్లాడిన ఉపన్యాసకులు democratic element గురించి academic element గురించి ఏమీ అభ్యంతరం చెప్పలేదు. వాటి స్వరూపం విషయమై కొన్ని సూచనలు మాత్రమే చేశారు. అందరూ ఏక గ్రీవంగా తిరస్కరించినది governmental bureaucratic interference ను. ఆవైపునుంచి ఈవైపునుంచి నాలుగు గోడలపైనుంచి ఈ విషయమై వత్తిడి జరుగుతూనే ఉన్నది. దానిని గమనించి కొన్ని సవరణలకు ప్రభుత్వం అంగీక రించాలని కోరుతున్నాను. ఉదాహరణకు సెనేటును తీసుకుందాము. దీని composition లో Chanceller, Vice-chanceller, Vice-chancellors of the other Universities, Secretary to the Government for Finance Department ఉన్నారు. దీనిని అనుభవజ్ఞులైన విశ్వవిద్యాలయంలోని ఉపాధ్యా యులు ఏకగ్రీవతీర్మానంలో వ్యతిరేకిస్తున్నారు దీనిని theoretical గా సమర్థించవచ్చును; కాని అది unreal అవుతుంది. తమ అనుభవందృష్ట్యా వారు వ్యతిరేకిస్తున్నారు. వారి sentiments ను అనుభవాన్ని గౌరవించాలని కోరు తున్నాను. ప్రభుత్వం విశ్వవిద్యాలయానికి కొంత block grant గా ఇస్తుంది. దానికి పైన క్రింద ఎర్ర గీత గీస్తారు, ఆ గీతల లోపలనే manage చేసుకో డానికి. వారందరు professors కదా, academic body కదా, యావత్తు సమాజంలోని cream అని అంటున్నాము కదా, వారు పనికిరారా; వారు చేసుకోలేరా; మధ్య ఈ అత్త పెత్తనం ఎందుకు ? కావాలంటే, అవసరమైతే, ఒక chartered accountant ను treasurer గా వేసుకోవాలని నియమం పెట్టండి అంతేకాని వోటు కలిగిన ఒక సభ్యుడుగా వేస్తున్నా రంటే వారు అనుమానిస్తున్నారు. అనుమానించడానికి అనుభవంలో నుంచి కొన్ని తార్కాణాలను చూపిస్తున్నారు. వారి అభిప్రాయానికి విలువ నివ్వాలని కోరుతున్నాను. Circle Commander of the National Cadet Corps అని ఒక సభ్యత్వం ఇచ్చారు. కేవలం సంఖ్యను పెంచడానికి తప్ప ఇదేమి effective memberhip? వారు ఇచ్చే contribution ఏమిటి? Democratic control కు ఉపయోగపడుతుందా ? Principals of the University and the coustituent and the affilianted colleges, the wholetime University Professors and other Professors appointed by the University — అన్నారు. ఇది బాగానే ఉన్నది; పట్టభద్రుల నియోజకవర్గం నుంచి 15 మందికి మించకుండా వేసుకోవాలన్నారు. ఇది ఒక రకమైన academic representa-

tion ; బాగానే ఉన్నది అనుకుందాము. పట్టభద్రుల నియోజకవర్గం విషయంలో కూడా కొన్ని పవిత్రమైన సూత్రాలను రాధాకృష్ణన్ కమిటీ రిపోర్టునుంచి తీసుకున్నామని అన్నారే! రాధాకృష్ణన్ కమిటీ ఈ విషయమై చెప్పినది గమనించలేదనుకుంటాను. పట్టభద్రుల నియోజకవర్గ మనేది సందేహాస్పదమని వారు అన్నారు.

వా రెక్కడెక్కడ ఉంటారో యేమీ పూచీలేదు. Registered list లో కూడా ఎవరో తమ కవసరమైనప్పుడు ఎన్నికలకోసమని రిజిష్టరు చేయిస్తుంటారు. ఈ రకంగా జరుగుతూ ఉంటే యూనివర్శిటీలపై control అంతా అవాంఛనీయమైన గ్రూపుల చేతులలోకి వెళ్ళిపోతుంది. ఈ ప్రమాదంనుండి యూనివర్శిటీని రక్షించవలసియున్నది. ఇది చాలా గణనీయమైన ప్రమాదం. తక్షణ చర్యలు తీసుకోవాలని వారు వ్రాశారు అమెరికాలో వున్న system గురించి వ్రాశారు. ఆ పద్ధతి పెట్టమంటారు. ఇక్కడ 15 వరకూ పెంచారు. బాగానేవుంది. కాని విద్యారంగంలో ఆంధ్రదేశంలో చాలమంది ఉపాధ్యాయు లున్నారు. పంచాయతీబోర్డు ప్రెసిడెంటులు ఎంతవరకు విద్యా విషయంలో పూచీగా తమ అధికారం exercise చేస్తారో Secondary Grade teachers మాత్రం అంతపూచీతో vote చేయరా? వారిని ఎందుకు గణనలోకి తీసుకోలేదు. వారినికూడా తీసుకుంటేనే దీనికి సరైన పుష్టివస్తుందని నా మనవి. గవర్నరు నామినేటు చేసేది 6% పంచాయతీలు, municipality లు 10% వగైరాలున్నాయి. ఈ nomination అనేది ఎంత కశ్మలానికి గురియైనదో నేనుకాదు చెప్పేంది, ఆ వైపునుంచి వస్తున్నది గొడవ. కనీసం యీనాడున్న ఆంధ్ర sentiment నైనా గమనించి body politic కి అనారోగ్యం పోయే వరకైనా కొంతకాలంపాటు యీ nominations కి నమస్కారంపెట్టి దూరంగా పెట్టడం మంచిది మీకు కావాలంటే ఆ 16 గురిని కూడా ఒక constituencyని చేసి ప్రజాస్వామిక పద్ధతిలోకి తీసుకురండి. 25 వేల రూపాయలిచ్చిన వాడికి Life-membership అన్నారు. అసలు డాక్టరు రాధాకృష్ణ కమిటీ వారు ఒక లక్ష రూపాయలు పెడితే యివ్వాళ 25 వేల రూపాయలు ఎందుకు పెట్టారు? ఈనాడు అన్నామలైలు లేరు— abolition of princes జరిగింది కనుక, విక్రమదేవ వర్మలు లేరు— చిన్న చిన్న జమీందారీలు పోయాయికనుక, ఇంక ఏమి మిగిలింది? Landlordism మిగిలింది. Monopoly capital మిగిలింది. Landlordism కూడా ఏదో గ్రుడ్డిలో మెల్లగా సంస్కరణ తీసుకువచ్చి, దానిని విభజిస్తాం. ఇవ్వాళ శ్రీ పట్టాభిరామారావు గారికి వారి తండ్రిగారికున్నంత ఆస్తివుండిపోదు. అందువల్ల ఆయనకు లక్షలాది

డబ్బు యివ్వడానికి వీలులేదు. Land lord గా యివ్వడానికి వీలులేదు. ఇక ఆంధ్రదేశంలో textile monopolies, sugar monopolies, cement monopolies మిగిలాయి, వీరిని బహుశః మనస్సులో పెట్టుకొని యిదిచేసివుంటారు. ప్రతి మూడువేలిచ్చిన వాడికీ ఒక్కొక్క సంవత్సరం membership యిచ్చినట్లయితే ఒక చిన్నజాగీరుదారు ఎక్కడో పోరంబోకుగా పడివున్న 20 ఎకరాల భూమిని ఒక 5 లక్షల రూపాయల ఖరీదుకట్టి "యూనివర్సిటీకి నేను యిస్తున్నాను" అని 159 Members ను కొనేయవచ్చు. దానికి అవకాశం మీరెందుకివ్వాలి. ఇది తెలియకుండా చేసినదనుకోను. మొత్తంమీద ప్రభుత్వం గాని, లేక కొన్ని వర్గాలుగాని అవసరమైనప్పుడు యీ పవిత్రమైన గృహాలలోకి దొడ్డిమార్గాన ప్రవేశించడానికి అవకాశం వుంచడానికి బిగించి వున్నారనే సందేహం యీవైపు నుంచి కాక ఆవైపునుంచే వచ్చింది కనుక దయచేసి దీనినికూడా ఉపసంహరించుకోవాలని వారిని కోరుతున్నాను.

శ్రీమతి వై. సీతాకుమారి : అధ్యక్షా, విద్యామంత్రిగారు ప్రవేశపెట్టిన యూనివర్సిటీల బిల్లును నేను బలపరుస్తున్నాను. చాలా కాలంనుండి మన ఉస్మానియా యూనివర్సిటీ శాసనబద్ధమై లేదు. ఏదో ఒక చార్టరు వుంది. అది కూడా సరిగా ఆర్డరులో లేక ఆచరణలోకి రాలేదని భావిస్తున్నాను. అట్టి పరిస్థితులలో ఒక సమగ్రమైన చిత్తు శాసనాన్ని తయారుచేసి దానిని యిందులో ప్రవేశపెట్టడము, దానిని ఆమోదించబోవడము చాలా సంతోషముగా వుంది. సభ్యులు అందులో వున్న విషయాలు చాలా సమగ్రంగా విచారించారు. వైస్-ఛాన్సలర్ నియామకం గురించి ఎక్కువ మంది మాట్లాడారు. ఒక చిన్న విషయం గురించి సభ్యు లందరూ యింత దీర్ఘంగా కాలాన్ని వినియోగించడం నాకు బాధ కలిగించింది. ఎన్నికలను మనం చూస్తున్నాం. ఇదివరకు కొన్ని విశ్వవిద్యాలయాలలో చూసినారు. ఎన్నికలు ఒక్కొక్కసారి జూదంలాగ వుంటాయి. చాలా అర్హులైనవాడు కూడా ఓడిపోవచ్చు. ఇంకోరు రావచ్చు. ఒక చిన్న margin లో దేశానికి ఎక్కువ ఉపయోగించే మేధాశాలులు కూడా తప్పిపోతూ వుంటారు. అప్పుడు యీ nomination పద్ధతి బాగుంటుంది. దేశానికి ఉపయోగకారి కావలసిన వాడు తప్పకుండా (without fail) రావడానికి అవకాశం వుంటుంది. అందుచేత nomination ఉంచితే బాగుంటుందని భావిస్తూ దానిని ఆమోదిస్తున్నాను. గడచిన రెండు మూడు నెలల క్రిందట జరిగిన వైస్-ఛాన్సలర్ నియామకం, అప్పుడు విద్యార్థులు జరిపిన పోరాటం, అవన్నీ మనం విన్నాం. అవన్నీ యదార్థమైనవి కావు. తెర వెనుక భాగోతాలు. ఇక్కడ వుండే కొంత మంది రాజకీయ నాయకులు తమ

స్వప్రయోజనాల కోసము విద్యార్థులను తీసుకువచ్చి వారిని ముందుపెట్టి ఆడుతున్న నాటకమని తరువాత తరువాత మనకు తెలిసినది. విద్యార్థులకు ఇందులో సభ్యత్వం వుండాలని ఒక సభ్యులు చెప్పినారు. విద్యార్థులకు రాజకీయ విజ్ఞానం యివ్వవలసినదే కాని వారిని తమ స్వప్రయోజనాలకోసం రాజకీయ పోరాటంలో వినియోగించుకోడం మనం తీవ్రంగానిరసించాలి. సాధారణంగా పిల్లలను తల్లిదండ్రులు గారాబంగా పెంచుకుంటారు. అందులో ఎంతోమందికి ఒక్కొక్కపిల్లవాడే వుంటాడు. సర్వానికీ వారే ఆధారంగా పెంచుకుంటారు. ఆనాడు జరిగిన సంఘటనల గురించి చెప్పడం కొంత అనవసరమైనప్పటికీ యీ రోజు డాక్టరు చెన్నారెడ్డిగారు విద్యార్థుల representation తీసుకురావాలని చెప్పినారు గనుక నేను చెబుతున్నాను. పిల్లలు పెద్దవారై ఇంజనీర్లు, డాక్టర్లు, దేశోద్ధారకులు అవుతారని తల్లిదండ్రులు కొండంత ఆశ పెట్టుకుంటారు. ఒక చిన్న ప్రయోజనంకోసం యీ పిల్లవాండ్లను—తమ సొంత పిల్లలను కార్లలో యింటికి పిలిపించుకుని—వినియోగించడం న్యాయంకాదు. ఆ రోజున భగవంతుని దయవలన శ్రీ సంజీవరెడ్డిగారి ప్రభుత్వం పిల్లలపై తుపాకికాల్పులు గాని లాఠీఛార్జి గాని చేయలేదు. ఇదివరకు శ్రీ చెన్నారెడ్డిగారు సభ్యులుగా వున్న మంత్రివర్గం విద్యార్థులమీద తుపాకి కాల్పులు చేశారు. Tear gas ప్రయోగించినవిషయం తెలిసినదే. విద్యార్థులకు వైస్‌చాన్సలర్‌తోటి యేమీ సంబంధం వుండదు. వారిని తెచ్చి రాజకీయాలకు బలిదానం ఇవ్వడం న్యాయంకాదు. ఇటువంటిది మరొకసారివస్తే దానికి వెనుకనున్న రాజకీయనాయకులను విచారించి ఆ రాజకీయనాయకులను కఠినంగా శిక్షించవలసినదిగా నేనుప్రభుత్వాన్ని కోరుతున్నాను. సభ్యులంతా మంచిసంస్కరణలు కోరుతున్నారు. స్త్రీలకు, హరిజనులకు representation వుండాలన్నారు. మాటిమాటికి హరిజనులను స్త్రీలను యీ విధముగా తీసుకొనిరావడం నాకు చాలా విచారం కలిగించింది. మాకు భారత రాజ్యాంగంలో సమాన హక్కులు ఉన్నవి, అవకాశాలు ఉన్నవి. అవకాశం ఉన్నటువంటివారంతా పైకి వచ్చి తమ మేధాశక్తిని దేశంకోసం ఉపయోగించవలసియున్నది. స్త్రీలకు, హరిజనులకు కూడ ఈనాడు సమానావకాశములు ఉన్నవి. ఏ ఆర్గనైజేషన్సు నుంచి ప్రతినిధులను తీసుకొంటున్నారో, అందులో స్త్రీలు, హరిజనులు ఉంటే తీసుకొనవచ్చును. ఆ కారణంచేత వారిని విడిచిపెట్టవద్దు గాని ప్రతిచోట వాళ్ళను లాక్కురావడము బాగుండదని అనుకొంటున్నాము.

సోదర సభ్యులు చేసిన విమర్శలు వింటే నాకు కొంచెం విచారము కలిగినది. ప్రభుత్వము ఏ శాసనాన్ని తీసుకురాబోతున్నా, ఏమి చేయబోతున్నా

దాని వెనుక ఏదో భయంకరమైన కుట్ర ఉన్నదని, దేశాన్నంతా ఒక మాయా జాలములో పెట్టే ప్రయత్నం చేయుచున్నట్లు, విపరీతమైన భావం, వికారమైన ముఖ భావములను ప్రదర్శించుతూ యుద్ధము చేయుచున్నట్లుగా మాట్లాడవలసిన పనిలేదు. శాసనములు చేసేవారు దేశముయొక్క అభ్యుదయమును మనస్సులో పెట్టుకొని చేస్తారేగాని ఏదో తమ స్వప్రయోజనంకోసమని, ఎల్లకాలమూ తామే పదవులో ఉంటామని, తమ మనిషినే పెట్టుకొంటామని, ఆ మనిషి ఎల్లకాలం తాము చెప్పినట్లే వింటాడని చేయరు. ఆవిధంగా చేస్తారేమోనని, దానివల్ల దేశమునకు అనర్థం కలుగుతుందని అపోహాలు పెట్టుకొని, ఈ శాసనసభ యొక్క అమూల్యమైన సమయమును వృథాచేయుట బాగుండలేదు. ప్రభుత్వము నిష్కలంకమైన బుద్ధితో, ప్రజలమీద ప్రేమతో, ముఖ్యంగా తెలంగాణావాసుల అభివృద్ధికోసం, ఉస్మానియావిశ్వవిద్యాలయము మన చేతులలోనుంచి పోకుండా తెలంగాణా ప్రజలకు, ఆంధ్ర ప్రజలకు అందరికీ ఉపయోగముగా ఉండునట్లు ఇక్కడ ఉంచటములోను, ఎంతో కష్టపడి ఈ శాసనాన్ని సిద్ధంచేసి తీసుకొని రావడంలోను సదుద్దేశము ఉన్నదని మనము భావించి, అందులో ఏవైనా చిన్న చిన్న సవరణలు ఉంటే సెలెక్టు కమిటీలో చూచుకొనవచ్చును గనుక యిప్పుడు అనవసరమైన అనుమానాలు, అపోహాలు పెట్టుకొనకుండ, అందరూ దీనిని ప్రేమతో సపోర్ట్ చేసి ఆమోదిస్తారని ఆశించుతూ విరమిస్తున్నాను.

శ్రీ కె. యల్. నరసింహారావు (ఎల్లందు-జనరల్) : అధ్యక్షా ! యూనివర్శిటీస్ బిల్సు మూడు ఏకోన్ముఖంగా మన ముందర చర్చకు పెట్టబడినాయి. వీటిమీద అనేకమంది తమతమ అభిప్రాయములను వెల్లడించారు. అయితే అధిక సంఖ్యాకులు ఇది ఏ డైరెక్షనులో ప్రజాస్వామ్యమునకు విరుద్ధముగా పోతున్నదో దానిని ఎత్తిచూపడము కొరకు గవర్నమెంటును సరైన మార్గములో పెట్టుట కొరకు, సలహాలు యిచ్చుటకు ప్రయత్నం చేశారు. కొద్దిమంది, లెక్కకు గణనకు రాకుండా ఉండేవారు, దీనిని చూచినా చూడకపోయినా సమర్థించడము కొరకు ప్రయత్నం చేశారు. తమ ప్రేమనంతా పొందుపరచి దానిలో నిండుగా చూపించారు. అయితే యిప్పుడు మన ముందుకు ఈ బిల్సు రావడానికి ఒక చరిత్ర ఉన్నది. ఆ చరిత్ర మనము మరచిపోయే అవకాశము ఎక్కడా లేదు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత, ఉస్మానియా యూనివర్శిటీ వైస్-ఛాన్సలరును నియమించే సందర్భంలో ఇక్కడ పెద్ద ఎత్తున అలజడి, ఆందోళన జరిగింది. దాని విషయం పెద్దలందరకూ తెలుసు. ఆ ఉద్యమాన్ని తట్టుకొనలేక మంత్రులంతా దొడ్డిదారిన పారిపోవలసిన అవసరం ఆ రోజులలో ఏర్పడింది. విద్యార్థులకు జవాబు చెప్పవలసిన అవసరం ఏర్పడుతుందేమోనని, దొడ్డిదారిన ఇండ్లకు

చేరుకోవలసి వచ్చింది. ఆ రోజులలో, మంత్రి రంగారెడ్డిగారు విద్యార్థులకు ఒక హామీ నిచ్చారు. శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీలో. వైస్-ఛాన్సలర్ నియామకమునకు ఏ పద్ధతి, ఏ విధానము అనుసరిస్తున్నారో, అదే విధానము ఉస్మానియా యూనివర్శిటీలోకూడా అమలు చేస్తామన్నారు. బడ్జెటు సమావేశములో ఆ స్వరూపముతో ఒక బిల్లు వచ్చేట్లు చూస్తామని, అది ఇంప్లిమెంటు చేసేట్లు చూస్తామని వారు అన్నారు. వారు (రంగారెడ్డిగారు) ఇంతకు ముందు స్పష్టం చేశారు. కేశవరెడ్డిగారు చెప్పినట్లు, తమ ప్లీడరీ వృత్తిలో వచ్చిన పాండిత్యాన్ని అంతా ప్రదర్శించుటకొరకు మరొకసారి యిక్కడ వేరే రూపములో ప్రయత్నించారు. అది ఏమిటంటే "ఆనాడు నేను చెప్పినది వెంకటేశ్వర యూనివర్శిటీకి ఉస్మానియా యూనివర్శిటీకి సమమైన ప్రాతిపదిక మీద వైస్-ఛాన్సలరును ఏర్పాటు చేసేట్లు చూస్తానన్నానేగాని వెంకటేశ్వర యూనివర్శిటీతో సమంగా తీసుకు వస్తానని అనలేదు" అనే ధోరణి తీసుకు వస్తున్నారు. అంటే "ఇక్కడకూడ ఎన్నికలు పెట్టిస్తానని వాగ్దానంమాత్రం చేయలేదు. నేను చేసింది ఏమంటే ఆ ప్రాతిపదికమీద తీసుకు వస్తానని చేశాను" అనే ధోరణిలో చెబుతున్నారన్నమాట. అందుకని ఇవాళ వెంకటేశ్వర యూనివర్శిటీ యాక్టుకు కూడ అమెండ్‌మెంట్సు తీసుకరావటం, అక్కడ ఉన్న అవకాశాలనుకూడ తొలగించటం జరుగుతోంది. అవి తొలగించిన తరువాత మనం చూచుకొన్నట్లయితే దానితో సమానంగా కనపడుతుంది అంటున్నారు. అసలు ఉస్మానియా యూనివర్శిటీకి వైస్-ఛాన్సలరును అపాయింట్ చేయుట ఎప్పుడు జరిగింది? వెంకటేశ్వర యూనివర్శిటీ వైస్-ఛాన్సలరు నియామకమునకు ఏ విధానము ఉన్నది? ఆనాడు ఇక్కడి విద్యార్థులు కోరినది ఏమిటి ? మినిస్టరుగారు ఇచ్చిన హామీ ఏమిటి ? అనేది వారు మరచిపోతున్నారు. ఆనాడు వెంకటేశ్వర యూనివర్శిటీ వైస్-ఛాన్సలరు పదవికి ఎలక్షను విధానము ఉన్నది. అది ఇక్కడ ప్రవేశపెట్టమని విద్యార్థులు ఆందోళన చేశారు. దానిని సాధిస్తామని మినిస్టరుగారు అన్నారు. ఒకవేళ దానిని సాధించిపెట్టలేకపోతే కాబినెట్‌లో నుంచి తప్పుకొనడానికి సిద్ధముగా నున్నానని వారు స్పష్టంగా చెప్పారు. పత్రికలు దానిని తాటికాయంత అక్షరాలలో ప్రచురించాయి. ఈవేళ ఈ బిల్లు చూస్తే వారు వెనుకటి వాగ్దానమును గుర్తులో పెట్టుకొని మంత్రి పదవినుంచి తప్పుకోవలసిన అవస్థ ఏర్పడుతుందేమోనని నేను తప్పుకోవడానికి సిద్ధముగా నున్నానని నేరుగా చెబితే ఎవరికి అభ్యంతరము లేదు. కాని ఆనాటి వాగ్దానానికి వక్రభాష్యముచేసి ఆ వాగ్దానాన్ని ఈ స్వరూపములో తీసుకువస్తున్నారు. ఇక్కడ ఉస్మానియా విశ్వవిద్యాలయపు విద్యార్థులు కోరినది అక్కడ ఉన్న ఎలక్షను విధా

నము అయితే అసలు వెంకటేశ్వర యూనివర్సిటీలోనే వైస్-ఛాన్సలర్ ఎన్ను కొనే విధానానికి తిరుతువరం చేయడంద్వారా మేము వీళ్ళకు ఆ అవకాశాన్ని ఇస్తున్నాము అనేది అర్థములేదు. మాకు ఆ ఎన్నిక అవకాశము కావలెనని తెలంగాణా ప్రజలు కోరారుగాని, వేంకటేశ్వర యూనివర్శిటీ ప్రాంతంలోని ప్రజలకు, అక్కడ సెనేటుకు ఉండే అవకాశాన్ని లాగివేయండని మాత్రం, ఆ నాడు ఇక్కడ ఆందోళన చేయలేదు. యూనివర్శిటీ వైస్-ఛాన్సెలర్ యొక్క ఎన్నికలు, ఉస్మానియా యూనివర్శిటీకి కావలెనని కోరారు. ఒక రకంగా చూస్తే ఇవాళ మన వేంకటేశ్వర యూనివర్శిటీ, ఆంధ్ర యూనివర్శిటీ ప్రాంతంలోని ప్రజలంతా తెలంగాణావారి మీద దుమ్మెత్తి పోయడానికి, ఇది ఒక ఆధారంగా ప్రభుత్వము తీసుకువస్తున్నదేమోనని అనుకోవలసిన అవసరం కూడ ఏర్పడుతోంది. ఇక్కడ ఎన్నికలు కావాలని కోరడం అంటే అక్కడ ఎన్నికలు తిరుతువరం చేయమని కోరడంకాదు. మాకు ఎన్నికలు కావాలని కోరితే—ఈఎన్నికలు తెలంగాణావారు కోరారు కాబట్టి ఉస్మానియా యూని వర్శిటీకి ఎన్నికలు పెట్టవలసిన అవసరం ఏర్పడుతుందని, ఇదివరకు ఆంధ్ర యూనివర్శిటీ, వేంకటేశ్వర యూనివర్శిటీలలో ఉన్న ఎన్నికల పద్ధతిని రద్దు చేస్తాము అనే విధానాన్ని ప్రభుత్వం చేపట్టడం మన దురదృష్టమని నేను అనుకొంటున్నాను. ఇప్పటికైనా సరే, క్యాబినెట్ మొత్తంగాను ముఖ్యంగా రంగారెడ్డిగారు దీని విషయములో ఆలోచించుకొనవలసిన అవసరం ఉన్నది. తమ వాగ్దానం చెల్లింపలేని పరిస్థితులలో, వారు ఇంకా సిగ్గువిడిచి ఆ క్యాబినెట్‌లో ఉండడం అంటే అంతకన్నా అర్థరహితమైన విషయం ఇంకొకటి ఉండదు అని నేను వారికి చెబుతున్నాను. వారు గతంలో హైదరాబాదు సంస్థానంలో తెలంగాణా ప్రాంతంలో ఉండే ప్రజలలో సంపాయించుకొన్న పలుకుబడి పోకుండా నిలబెట్టుకోవాలంటే ఈ బిల్లు ఇదే స్వరూపములో వైస్-ఛాన్సెలర్ ఎన్నికలు లేకుండా, రేపు సెలక్టు కమిటీనుంచి వచ్చి ప్యాస్ అయ్యే పరిస్థితిలో వారు (రంగారెడ్డిగారు) తక్షణం క్యాబినెట్‌లో నుంచి తప్పుకొనడమే వారి గౌరవాన్ని కాపాడుకొనడానికి నిదర్శనంగా ఉంటుంది తప్పితే "ఇది ఇట్లాగే ప్యాస్ అవుతుంది. నేను legal point of view తో దానిని నిరాకరించే అవకాశం కొంత నా చేతిలో ఉంది. అయినప్పటికి నా గౌరవానికి ఏమీ భంగం రాదు." అని అనుకుంటే మాత్రం, రంగారెడ్డి గారికి గౌరవం ఉండదు. ఇట్లా ఎప్పటికప్పుడు ప్రజలకు యిచ్చిన వాగ్దానాలను కాలరాసే మంత్రులు ఉన్నప్పుడు క్యాబినెట్‌కు గౌరవం ఉంటుందని అనుకోవలసిన అవసరం గాని, అవకాశం గాని ఎక్కడా లేదని నేను సవినయంగా మనవి చేస్తున్నాను. అయితే

ఇంతకుముందు మంత్రులు చెప్పారు. ఈ యూనివర్శిటీస్ యొక్క నిర్వహణ ఏ ప్రకారంగా ఉండాలి, దానిలో గవర్నమెంటు యొక్క దఖలు ఎంతవరకు ఉండాలి, అనే సమస్యను గురించి చెప్పడం జరిగింది. Academic Council, Vice-Chancellor నియామకం ఇవన్నీ చూచినప్పుడు, ఛాన్సలర్ గారికి సర్వ హక్కులు వచ్చేసినవి. మనము దీనిని పరిశీలించి చూస్తే ప్రతి క్లాజులోను గవర్నమెంటు యొక్క అధికారం, గవర్నమెంటు యొక్క హక్కును పొందు పరచడం జరుగుతున్నది. అంతేకాకుండా గవర్నమెంటల్ హెడ్‌గా ఉండే, గవర్నరు గారికి ఛాన్సలర్‌గా సంపూర్ణంగా అవకాశం చిక్కుతుంది. వారికి వైస్-ఛాన్సెలరును నామినేట్ చేసే అవకాశం దీనిలో లభించడం జరిగింది. ఆ కమిటీకి ఇద్దరిని ఎన్నుకుంటారట. మొత్తం ముగ్గురిలో నుంచి ఒకరిని గవర్నరు (ఛాన్సెలర్) నామినేట్ చేస్తారు. ఆ కమిటీకి ప్రెసిడెంటును కూడ ఛాన్సెలర్ గారు నామినేట్ చేస్తారు ఆ కమిటీ 3 పేర్లు సూచిస్తుంది. తనకు అనుకూలమైనవారు వచ్చేదాకా ఆ ముగ్గురిలో నుంచి ఎవరినైనా ఒకరిని ఆయన వైస్-ఛాన్సెలర్‌గా నియమించడం గాని లేక ఆ ముగ్గురి లిస్టును ఎప్పటికప్పుడు తిప్పికొడుతూ ఉండటం గాని జరుగుతుందనేది స్పష్టం. ఈ రకంగా ఇది పెట్టడం సబబైన విషయం కాదు.

తరువాత సెనేట్ విషయం ఆలోచిద్దాము. సెనేట్‌లో ఎన్నికలకు ఏమైనా అవకాశం ఉన్నదా ? అని చూస్తే పెద్దఎత్తున ఎన్నికలకు ఎక్కడా అవకాశం లేదు ఎక్కడ ప్రజలకు అవకాశం ఇవ్వవలసి వచ్చినప్పటికీ, నామినేషన్లు అనేది ఇక్కడ కనపడుతోంది.

మొన్ననే కౌన్సిల్‌కు ఎన్నికలు జరిగాయి తెలంగాణా ప్రాంతంలోని మునిసిపాలిటీలలో పంచాయతీలలో ఎలక్టెడ్ మెంబర్సుకన్నా నామినేటెడ్ మెంబర్సు ఎక్కువమంది ఉన్నారు. ఈ నామినేటెడ్ మెంబర్సుకు మళ్లీ దీనిలో అవకాశం ఇస్తున్నామా ? గ్రామ పంచాయితీ అధ్యక్షునకు ఎందుకు అవకాశం ఇస్తున్నాము? డిస్ట్రిక్టువైజ్‌గా పెట్టవలసినఅవసరం ఏమివచ్చింది? యూనివర్శిటీ ఏరియా మొత్తమును ఒక ఏరియాగా తీసుకొని, ఆ ఏరియా మొత్తానికి ప్రపోర్షన్ రిప్రజెంటేషన్ పద్ధతిమీద ఎన్నికలు ఎందుకు పెట్టటంలేదు?— అని మనం ఆలోచించవలసిన అవసరం ఉన్నది. క్లాజు 4 లో

**"One person elected by the members of the Committees of Municipalities and the Sarpanches of Gram Panchayats in each district in the University area;**

Six persons nominated by the Chancellor of whom three shall be from among the members of municipal councils and Presidents of Panchayats in the Andhra University area and three shall be from among the members of municipal councils and Presidents of Panchayats in Sri Venkateswara University area;

Ten persons nominated by the Chancellor of whom three shall be from among the Scheduled Castes, one from among the Scheduled Tribes and five from among teachers"-

అని ఉన్నది. ఆంధ్ర యూనివర్సిటీ ఏరియానుండి ముగ్గురుని, యూనివర్సిటీ ఏరియానుండి ముగ్గురుని మన చాన్సలర్ గారు, అంటే గవర్నరుగారు నామినేట్ చేస్తారు. ఆ యూనివర్శిటీ ప్రాంతానికి యీ మూడవ ప్రొవిజన్ ద్వారా ఎన్నికలు ఏర్పాటు చేశారు. ఏ పద్ధతిలో ఏర్పాటు చేశారనే విషయం అటుంచండి. అదేరకంగా, ఇక్కడి యూనివర్శిటీకి పంపవలసినవాళ్లనుకూడ—వాళ్ళు ఎన్నుకొనడానికి అవకాశం ఇస్తే ఏమిపోయింది ? అదేవిధంగా ఏర్పాటు చేస్తే ఇక్కడ యూనివర్శిటీకి పంపే ముగ్గురిని కూడా ఎన్నుకోటానికి అక్కడ పోలింగుపెట్టే అవకాశం ఉండేది. అట్లా కాకుండా, వారిని చాన్సలర్ గారు నామినేట్ చేస్తారు. అంతేకాదు; "10 persons నామినేటెడ్ బై ది చాన్సలర్"తో, షెడ్యూల్ ట్రైబ్స్‌కు ఒకరు, షెడ్యూల్డ్ కాస్ట్‌కు కొంతమంది, టీచర్సు ఐదుగురు ఉంటారుట. ఇప్పుడు కౌన్సిల్ కొరకు టీచర్సు కాన్‌స్టిట్యుయన్సీస్ ఏర్పడ్డాయి. యూనివర్శిటీ ఏరియాలోపల మన టీచర్సు కాన్‌స్టిట్యుయన్సీస్ పెట్టవచ్చు, టీచర్సుయొక్క సంఖ్యను కొంత హెచ్చు చేయవలసిన అవసరం ఉన్నదనే వాదన కూడ ఉన్నది. అయితే ఆ టీచర్సు తమ ప్రతినిధులను యూనివర్శిటీకి పంపటానికి అవకాశం కలిగించటానికి బదులు టీచర్సు తరఫున గవర్నరుగారు నామినేట్ చేస్తారు. అదేవిధంగా షెడ్యూల్డ్ కాస్ట్స్ తరఫున గవర్నరుగారే నామినేట్ చేస్తారు. షెడ్యూల్డు ట్రైబ్స్ తరఫున నామినేట్ చేస్తారు. ఆంధ్ర యూనివర్సిటీ తరఫున నామినేట్ చేస్తారు. వెంకటేశ్వర యూనివర్శిటీ తరఫున నామినేట్ చేస్తారు, ఇట్లా మొత్తంగా. ఇదంతా నామినేషన్సుతో కూడుకొన్నదని చెప్పవలసి ఉన్నది. యూనివర్సిటీలకు స్వతంత్రప్రతిపత్తి ఇస్తామని ప్రభుత్వం ఒకవైపున చెబుతూనే, రెండవవైపున యీ నామినేషన్స్ ద్వారా పూర్తిగా వాటిని తన చేతులలోకి తీసుకొంటున్నది. ఈ బిల్లులోని ఆర్టికల్ 6 చూస్తే మనకు ఒకసంగతి బోధపడుతుంది. దాంట్లో యూనివర్శిటీ లలో పనిచేసే ప్రొఫెసర్సుకు ఏవిధమైన స్థానం ఉన్నదో చూడాలి. మతతత్వానికి సంబంధించిన విషయాలలో సంబంధములు గలవారు ఆ ఉద్యోగం చేయటంలో

అభ్యంతరంలేదు అని దాంట్లో ఉంది ఈనాడు ఉస్మానియా యూనివర్సిటీలో ప్రొఫెసర్స్‌గా పనిచేస్తున్న పెద్దలకు కొన్ని రాజకీయ అభిప్రాయాలు ఉండటం సహజము. వాటిని మనం గౌరవించటం అవసరమా, కాదా అన్నది ఆలోచించాలి. వారు స్టూడెంట్స్‌కు ఎకనమిక్స్‌తో పాటు పోలిటిక్స్ కూడ బోధించవలసిఉంటుంది. కాబట్టి వారికి కొన్ని అభిప్రాయాలు ఏర్పడటం సహజము. కాబట్టి పొలిటికల్ అభిప్రాయాలు కలిగినటువంటివారికి దాంట్లో ఏ విధమైన నిషేధం లేకుండా, వారికి పూర్తిహక్కులు కలిగించవలసిన అవసరము ఉన్నది. పొలిటికల్ అభిప్రాయాలు కలిగిఉండటం ఒక నేరంగా పరిగణించే విధానం ఏదైతే ఇవాళ అనుసరింపబడుతున్నదో, దానిని రద్దుచేయవలసిన అవసరము ఉన్నది. ప్రభుత్వం యీ విధంగా తన గుప్పెట్లో మొత్తం యూనివర్శిటీ పరిపాలనను, నిర్వహణను పెట్టుకోవటం సరైనదికాదు. ఎకడమిక్ కౌన్సిలు పూర్తిగా నామినేటెడ్ బాడీ అనిపించుకొంటుంది. ఎకడమిక్ కౌన్సిల్‌లో ఉండేది ఎవరు? అందులో వైస్‌చాన్సలర్ ఉంటారు; డైరక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రిక్షన్ ఉంటారు; ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ, సంగీత నాటక-ఎకాడమీ మరియు లలితకళా ఎకాడమీ అధ్యక్షులు ఉంటారు. ఈ ఎకాడమీలను ఏర్పాటుచేసినపుడు, వాటి అధ్యక్షులను గవర్నమెంట్ ఎపాయింట్ చేసింది. ఈ విధంగా గవర్నమెంట్ ఎపాయింట్‌చేసిన అధ్యక్షులు కూడ దీంట్లోకి వస్తున్నారు. అంటే వారుకూడ 'appointed by Government' అని మనం అనుకోవలసిన అవసరంవస్తున్నది.

"The Director of Public Instruction,

The Presidents of the Andhra Pradesh Sahitya Akadami, Sangeet Natak Akadami and Lalita Kala Akadami.

The Principals of the University, Constituent and affiliated colleges; Professors of the University; The Heads of Departments who are not otherwise members of the Acadamic Council; Such members of the Syndicate as are not otherwise members of the Academic Council; Two persons nominated by the Chancellor who shall be Headmasters of Schools in Service in the University area at the time of nomination."

ఇవి దీంట్లో ఉన్నవి. మనం ఏదైతే యీ వైస్‌చాన్సలర్‌కు సంబంధించిన కమిటీ ఉంటుందనుకొన్నామో, ఆ కమిటీని సిండికేట్ ఎన్నుకొంటుంది. సిండికేట్‌లో కూడ నామినేషన్స్‌యొక్క మెజారిటీ గుప్పించబడింది. ఆ సిండికేట్‌లో ఎలక్టెడ్ పర్సనల్స్ లేరు. దాంట్లోఉండేది 'సెక్రటరీటు గవర్నమెంట్' 'డైరక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రిక్షన్' Four persons elected by the Senate" —

వీరు మాత్రమే ఎలెక్టెడ్ పర్సనల్స్ అని మనము అనుకోవలసిన అవసరము ఉన్నది. ఎకడమిక్ కౌన్సిలంతా నామినేటెడ్ అయినపుడు, ఆ ఎకడమిక్ కౌన్సిల్ ఎన్నుకొనేవారు, సాధారణంగా నామినేటెడ్‌గానే ఉంటారు అని తప్పనిసరిగా మనం అనుకోవలసిఉంది. ఒక నామినేటెడ్ బాడీ ఎన్నుకొంటుంది అంటే దాంట్లో అర్థం ఏమిటో తెలుసుకోవలసిఉంది అంటే, ఈ సిండికేట్‌లో కూడ మొత్తం నామినేటెడ్ పర్సన్సును గుప్పించిపెట్టారు అన్నమాట

ఇవాళ ప్రపంచం ప్రజాస్వామ్యంవైపు ఆలోచిస్తోంది. ఆ ఆలోచనను ప్రోత్సహించవలసిన అవసరము ఉన్నది. ఈ పరిస్థితులలో మనం నామినేటెడ్ విధానాన్ని తీసుకురావటం, వైస్ ఛాన్సలర్ యొక్క నామినేషన్ పద్ధతి ప్రవేశపెట్టటం, సరైనది కాదని చెబుతున్నాను. చాన్సలర్‌గా మనము గవర్నరును పెట్టినంతమాత్రమున, ఆయన స్వేచ్ఛాపూర్వకంగా నామినేట్ చేస్తారు అనే ఆశలు ఆంధ్రప్రదేశ్ ప్రాంతంలో మిగలకుండా పోయాయి. అనేక సందర్భాలలో వారు నామినేట్ చేస్తున్న విషయాలు మనం చూస్తున్నాము. వారు ఏ విధంగా గవర్నమెంటు పలుకుబడికి లొంగిపోయి వ్యవహారాలు చేస్తున్నారో మనకు స్పష్టంగా కనబడుతున్నది. అంతేకాదు, 'Party in power' యొక్క క్షేమాన్ని కాపాడటమే గవర్నర్ తన పనిగా పెట్టుకొన్నట్లు మనకు స్పష్టంగా కనిపిస్తున్నది. అట్లాంటప్పుడు, గవర్నరుగారిని చాన్సలర్‌గా మనం accept చేయటం, ఆ చాన్సలర్ గారు నామినేట్ చేసినవారిద్వారా, యూనివర్సిటీ వ్యవహారాలు నడపటం ఎంతవరకు సరైనపద్ధతో ఆలోచించాలి. కాబట్టి ప్రభుత్వం యూనివర్సిటీల యొక్క స్వేచ్ఛను అపహరించటానికి ప్రయత్నించకుండా, అవి స్వేచ్ఛగా ప్రజలలో విజ్ఞానసంపదను అభివృద్ధి పరచటానికి అవకాశం కల్పించే రీతిగా ఈ బిల్లును సెలక్టు కమిటీకి పంపాలని కోరుతూ ముగిస్తున్నాను.

శ్రీ కిష్టమాచారి : అధ్యక్షా, చాలదినాలనుండి ప్రతీక్షిస్తున్నటువంటి యూనివర్సిటీ బిల్లు 48 సెక్షన్స్‌తో ఈ దినం మనముందుకు వచ్చింది. ఈ సందర్భంలో నాకు ఒక చిన్న సంఘటన జ్ఞాపకం వస్తున్నది. అది చిన్న విషయమైనా నేను చెప్పదలచుకొన్నాను. మనం రైలులో ప్రయాణం చేస్తున్నప్పుడు సాధారణంగా ఒక విషయం చూస్తూ ఉంటాము. రైలు కదలుతూండగా, రైలు ఎక్కటానికి ఒక ప్రయాణీకుడు తలుపుదగ్గరకు వచ్చి నిలబడి "ఈ రైలు అందరిదీను, దీంట్లో అందరూ కూర్చోవాలి. ఎవరు ఎంతవరకు కూర్చుంటారు" అని వివేకానందుని వేదాంతమంతా వొలకబోసి, ఆ డబ్బాలోకి ఎక్కటానికి

ప్రయత్నం చేస్తాడు. ఆవిధంగా చెప్పి, డబ్బాలో అడుగుపెట్టి ఆ తలుపుకు ఎదురుగా బిస్తర్ వేసుకొని కూర్చుంటాడు. తర్వాత స్టేషన్‌లో స్వచ్ఛంగా వివేకానందుడు వచ్చినా, "వెళ్ళవయ్యా - ఇంకోచోట స్థలం ఉన్నది! ఈఒక్క డబ్బానే ఉందనుకొన్నావా" అని చెదరకొడతాడు. అదే పరిస్థితి ఈ దినము మన ప్రభుత్వానికి ఉన్నదా అన్న అనుమానము నాకు కలుగుతున్నది. "విద్యావేత్తలను ఏర్పాటు చేసేందుకు వారిని నియమించుటకు మేము యీ నామినేషన్స్ పద్ధతి తీసుకువస్తున్నాము" అన్న సుహృద్భావంతో కొంతమంది మాట్లాడారు. నేను వారిని ఒక ప్రశ్న అడుగుతున్నాను. మన రాష్ట్రములో విద్యావంతులుగా మనమే ఉన్నామా? మనకన్నా విద్యావంతులు లేరా? అని అడుగుతున్నాను. నా అభిప్రాయంలో మనలను, మన ప్రభుత్వాన్ని కూర్చోబెట్టి చెవులుపిండి చదువుచెప్పేటటువంటి విద్యావేత్తలున్నారు; రాజకీయ వేత్తలు ఉన్నారు. అటువంటప్పుడు ఈ ఎన్నికలన్నీ ఎందుకు? అందుకు ఈ ఖర్చు అంతా ఎందుకు? ఈడబ్బు వృధాచేయటం ఎందుకు? ఏ గవర్నరుకో అధికారం ఇచ్చి, విద్యావంతులందరిని ఎసెంబ్లీకి నామినేట్ చేయమంటే ఎంతో బాగుండేది. కాని మనం బయట ప్లాట్‌ఫారమ్స్‌మీద పెద్ద పెద్ద ఉపన్యాసాలు ఇస్తాము. డెమాక్రసీని రూపొందించే మాటలు మాట్లాడుతాము. డెమాక్రసీ అర్థాన్ని ప్రజలకు చెబుతాము. డెమాక్రసీలోనే బ్రతుకుతామని చెబుతాము. కాని ఆ పదవి మనకు వచ్చిన తరువాత, మనము అధికారంలో కూర్చుని, "డెమాక్రసీలో మంచివారు రారేమో, అందుకొరకు మేము మంచివారిని ఏర్పాటు చేస్తాము" అని చెబుతూంటే, మనలను చూసి దేశం నవ్వుతుందో, దుఃఖపడుతుందో ఆలోచించాలి.

కాని ఈ దౌర్భాగ్యము ఒక్క మా తెలంగాణావారికే కాదు. మాతో సహవాసము చేసినందుకు ఆంధ్రులకు కూడ జరుగుతున్నందుకు విచారపడవలసి వస్తున్నది. వారు ఒకవిధముగ ఒకే శాసనము చేసుకుని కొన్ని సంవత్సరాలుగా యూనివర్సిటీలను అభివృద్ధిలోకి తెచ్చుకోటానికి పాటుపడుతున్నారు. వారి దగ్గర ఎన్నికలు ఉన్నవి. వారు ఏదో కొద్దిగా ప్రజాస్వామికమును అభివృద్ధికి తెచ్చుకోవాలనే అభిప్రాయముతో పాటుపడుచున్నారు. కాని ఇది మన గౌ. రంగారెడ్డిగారి పట్టుదలనో, మరేదో కాని, వారు చెప్పేదిచూస్తే వారి గౌరవము ఈ విషయములో పోతుందనుకునో, లేకపోతే వారి సన్నిహితులైన ప్రభుత్వములోని పెద్దలు వారియందు సుహృద్భావము చూపదలచుకున్నారనో, వారు ఆవిధముగా మాట్లాడిఉండవచ్చు. మన గోపాలకృష్ణయ్యగారు చెప్పినట్లు "నీఒక్కనిముక్కు ఎందుకు పోవాలి, మీఅందరి ముక్కులుకూడ పోతే

అందరివి సమానముగా ఉండగలవు" అనే అభిప్రాయముతో పీటిని కూడ యిందు లోకి ఒక అడుగు వెనుకకు వేయటానికి పట్టుదలతో ప్రయత్నం జరుగుతున్న ట్లుగా కనబడుతున్నది. అయితే ఈ రెండు ప్రాంతాలకు ఉంటున్న శాసనాలను సమన్వయ పరచవలెననే ఉద్దేశ్యముతో ఆంధ్ర, వెంకటేశ్వర యూనివర్శిటీ లను ఉన్నచోట్లలో ఉంచకుండా వెనుకకు లాగడము నిజముగా హాస్యా స్పదము, అవమానకరము అని మనవిచేయదలచుకున్నాను. ఏదిఅయితే ప్రజా స్వామ్యము అంటున్నామో అది సమన్వయము చేయాలన్న ఉద్దేశ్యముతో ఈ రెండు ప్రాంతాల యొక్క శాసనములను మనము చేస్తూ వస్తున్నాము. ఇంతకుమునుపే Court Fees Act ను సమన్వయపరచుకున్నాము. దానివల్ల తెలంగాణ ప్రజలను ఎక్కువ డబ్బు కట్టమని ప్రోద్బలముచేశాము. జరిగినది ఏదో జరిగిపోయింది. శాసనములు సమన్వయము అనే పేరుతో ఆంధ్ర, వెంక టేశ్వర యూనివర్శిటీలలో ఉన్న ప్రజాస్వామ్యమును కూడ ఒక కాలితో తన్ను తున్నాము. మన దేశము ఈ ప్రజాస్వామ్యాన్ని వద్దని అంటున్నదా ? లేక పోతే వారి అభిప్రాయానికి విరుద్ధముగా ఉన్నదా అనే ఆలోచనచేయకుండా ఇష్టమువచ్చినట్లుగా అది అధికార గౌరవము అనండి, లేకపోతే అధికారము పిచ్చిఅనండి, అదిన్నీ కాకపోతే అధికారము దుర్వినియోగము చేస్తున్నారని ఏ వ్యక్తి అయినా నిరాఘాటముగ చెప్పగలుగుతాడు. అయితే ఈ బిల్లును నేను క్షుణ్ణముగా చదివిచూచాను. ఈ విషయములో నాకు తోచినదిమాత్రము ఒకటే. అందులో కథానాయకుడు ఒకడు Vice-Chancellor కనబడతాడు. ఆ కథానాయకుని నడిపే Director ప్రభుత్వం అని మాత్రము కనబడుతుంది. ఆ డైరెక్టరు యొక్క instructions కు లోబడి Vice-Chancellor నడవవలసి ఉంటుంది. అలాంటి వాతావరణము ఈ శాసనములో కల్పించబడిందని మాత్రము నేను మనస్ఫూర్తిగా చెప్పదలచుకున్నాను. అయితే ఎప్పుడైతే ఈ Vice-Chancellor పదవి పునాదులకే విరుద్ధముగాఉన్నదో పైన ఎన్ని sections ఉన్నప్పటికిని పైన ఉన్న building ఎంత మనోహరముగ కన్పించినప్పటికినీ, అది పునాదులు లేనటువంటి భవనమే అవుతుందని చెప్పకతప్పదు. ఇందులో ఇంకొక విచిత్రము కూడ కనబడుతుంది. యూనివర్శిటీల కొరకు ద్రవ్యము సంపాదించాలని ప్రభుత్వం అంటున్నది. దీనికి మనము ఎవ్వరము కూడ కాదన లేము. అది అవసరమేనని నేను కూడ అంటాను. మనము యూనివర్శిటీలను నడిపించాలి అంటే ఎంత ద్రవ్యమువస్తే అంత ఎక్కువగ వాటిని అభివృద్ధిపరచు కునే అవకాశము ఉన్నది. ప్రభుత్వము కూడ ఎంత ఖర్చుచేస్తే అంత మంచిది. ప్రభుత్వం ఖర్చుచేసే పరిస్థితిలో లేనప్పుడు సరే. ఖర్చుచేసే పరిస్థితిలో ఉన్నప్పటి

క్నీ, వాటికి వేరేవారి వద్ద నుంచి ద్రవ్యమును సంపాదించి, ఖర్చుపెట్టడము అవసరమే. కాని ప్రభుత్వం ఒక్కటిమాత్రము చేస్తే బాగా ఉండేది. ధనవంతులు దేశాభిమానులు యూనివర్శిటీల అభివృద్ధికొరకు ద్రవ్యముయిస్తామంటే వారిని ప్రోత్సహించాలి, వారిని గౌరవించాలి, నిజమే. వారిని గౌరవసభ్యులుగ మాత్రమే చేయాలి. అంతేకాని వారిని యిందులో మెంబర్లుగ చేర్చి, ఓటింగుకు హక్కు యిచ్చి వారియొక్క మెజారిటీతో యూనివర్శిటీలను నడిపించ దలచుకుంటే, ఆ విధానము సరైనదికాదు. ద్రవ్యము యివ్వగలిగినవారు, యిచ్చేవారు ఎంతోమంది ఉంటారు. ఆవిధముగ చేస్తే, యిక యూనివర్శిటీ administration contract కు ఏ లక్షాధికారికో యిచ్చి నడిపించుచున్నట్లే అవుతుంది. అలాంటప్పుడు లక్షలు యిచ్చినవారికి Vice-Chancellor పదవి యిస్తామని చెబితే మేలు. అంతకంటే వేరే అభిప్రాయము కనబడదు. ద్రవ్యము యిచ్చేవారికి ఓటింగుహక్కు లేకుండా గౌరవసభ్యులను మాత్రమే చేయవచ్చు. దానికి ఎవ్వరు కాదనరు. అంతగా అవసరమనుకుంటే అలాంటి గౌరవ సభ్యులందరి తరఫున ఒక్క ఓటు మాత్రము యిచ్చి, వారిలోనుంచి ఒక్క సభ్యుని ఎన్నిక చేయించి ఓటింగు హక్కుతో సభ్యునిగా చేయండి. అలాంటి విధానము ప్రభుత్వము అవలంబించవచ్చు. అది అందరికి సమ్మతము కావచ్చు అంతేకాని 3 వందలు యిచ్చినా మెంబరుషిప్పు యివ్వడము, 500 యిచ్చినా మెంబరుషిప్పు, 10 వేలు యిచ్చినా మెంబరుషిప్పు, 25 వేలు యిచ్చినా మెంబరుషిప్పు యివ్వడమంటే, యిక ధనము యివ్వగలిగిన వారందరికీ మెంబరుషిప్పు యివ్వడము అవ్యక్తమనిపిస్తుంది. ఆ విధముగ చేసేబదులు వారిలో ఎవరికో ఒక్కరికి యిచ్చి వారిని represent చేయడానికి వీలుకలుగజేయడము మంచిది. అది democracy కి అనుకూలమని నేను అనను కాని మనకు ఉంటున్న ఆర్థిక దుస్థితినిబట్టి ధనము సంపాదించవచ్చుననే ఆశతో చేస్తే దానికి అభ్యంతరం ఉండకపోదు. అలా చేయకుండా 3 వందలు యిచ్చినవారి దగ్గరనుంచి ఓటు హక్కుతో మెంబరుషిప్పు యివ్వడము విరమిస్తే మంచిదని నా అభిప్రాయము. ఆ విధానమువల్ల University administration అంతా యీలాంటి donors చేతులలో పెట్టినట్లేనని గమనించాలి. Adminstration తారుమారు అయ్యే అవకాశము ఉండగలదు. ఆ విధముగా చేయడము వలన మనము దేశానికి ద్రోహము చేస్తున్నామని గుర్తించాలి. ఇదిగాక, మరొక విచిత్రమైన విషయము చెప్పదలచుకున్నాను. ధనము యిచ్చేవారు, తాము పోకుండా, వారి ఏజంట్లను పంపవచ్చు. లేకపోతే వారి మునీమ్‌ను పంపవచ్చు. లేకపోతే మరి యింట్లో పనిచేసేవారిని పంపవచ్చు. అందువల్ల

ఈ విధముగ ఓటు అధికారము యివ్వడము మంచిదికాదు. University అనే సంస్థ రాజకీయంగా, నైతికంగా, ఆర్థికంగా దేశాన్ని పురోభివృద్ధి గావించ టానికి మూలకారణమైన సంస్థ. అలాంటి సంస్థను ఈనాడు మామూలు కొలతబద్దతో నిర్లక్ష్యాభావముతో కొలుస్తున్నారంటే ఇది మనయొక్క అవివేకమనే చెప్పదగును. అంతేకాకుండా మన రంగారెడ్డిగారు చాలా బాగా advocate చేసి చెప్పారు. అది బాగాఉంటే, అదికాదని చెప్పే వకీలుగా నేను చెబుతున్నాను. వారి పాయింటు బాగానే advocate చేశారు. ఎందు కంటే జీవితమంతా ఏదోవిధముగ జరిగిపోయింది. నేనుకూడ వారి మాదిరిగ ఒక వకీలునేగనుక వారు చెప్పింది తప్పు అనిగాని, ఒప్పు అనిగాని, నూరు అణాలు ఉంటే అది తప్పు అనిగాని చెప్పే స్వభావము వకీలు అయిన మాబోటి వారికి ఉంటుంది. కాని వకీలుకు fees ఇస్తారు గనుక అక్కడికివెళ్ళి వారిని గెలిపించటానికి వారి తరఫున advocate చేయవలసిఉంటుంది. అదేవిధముగ మన రంగారెడ్డిగారు నేను హామీ యిచ్చానని అన్నారు. నేను వారిని వకీలు అని అంటాను. వారి ఉపన్యాసము బాగా ఉన్నది. వారు ఏమని కలకన్నారో గాని అది నాకుమాత్రం అర్థము కావడములేదు కాని ఎన్నో సంవత్సరాలకు పూర్వం, అంటే యీ తిరుపతి వెంకటేశ్వర యూనివర్శిటీ బిల్లుకు amendments రాకపూర్వము, అప్పుడు వారు చెప్పారు. వెంకటేశ్వరయూనివర్శిటీలో ఎట్లాఉన్నదో అట్లాగా చేయిస్తామని వారు విద్యార్థులకు హామీ యిచ్చానని అన్నారు. కాని యీనాడు యిక్కడ కూర్చుని వీటిని సమన్వయము చేశాము కదా అని అంటే, అది ఎంతో ఆశ్చర్యకరముగా ఉన్నది. అలాంటిది ముందుగా చెప్పివుంటే, అది ఎంతో గౌరవప్రదముగ ఉండేది. వారు దానిని ఎందువల్ల అతిక్రమించారో నాకు అర్థము కాలేదు. అయితే యీదినము వెంక టేశ్వర యూనివర్శిటీని గురించి చెబుతూ యిది చాలా ఉత్కృష్టమైన బిల్లు అని అన్నారు. అది నిజముగా ఉత్కృష్టమైనదో, నికృష్టమైనదో నాకు బోధపడడము లేదు. కాని ఇది సాత్యపూరితముగా ఉన్నటువంటిదిగా కన్పిస్తున్నది. ఎట్లాగు అంటే, మేము ఎప్పటికీ ప్రభుత్వంలో ఉంటాము. యూనివర్శిటీని నడిపించే అధికారము మా చేతులలోనే ఎప్పటికీకూడ ఉంటుంది. వాటిని మా అధికారము ద్వారానే నడిపిస్తామని అనడము అది అధికారవాంఛ తప్ప, దీనిలో ఏవిధమైన ఉత్కృష్టత లేదు. అది నికృష్టమునానే కనబడుతున్నదని ప్రజానీకము అను కుంటారు. ఇంతేకాక ప్రజాస్వామ్యములో మనము యీనాడు ఉన్నాము. ప్రజాస్వామ్యమును మనము గౌరవిస్తున్నాము. దేశము ప్రపంచము అంతా గౌరవిస్తున్నారు. ప్రజాస్వామ్యముపట్ల ప్రభుత్వానికి ఇంత నిర్లక్ష్యాభావము

ఎందువల్ల కలిగిందో తెలియలేదు. ఈ విధమైన వాతావరణాన్ని అంతా దృష్టిలో పెట్టుకుని ప్రభుత్వం తమయొక్క అమూల్యమైన అభిప్రాయాలతో మరల ఇంకొక బిల్లును తీసుకుని వస్తారని ఆశిస్తూ ఇంతటితో ముగిస్తున్నాను.

శ్రీమతి సి. అమ్మన్నరాజా : అధ్యక్షా, ఈ బిల్లునుగురించిన చర్చ అన్ని పక్షాలవారు సరిగా దీని భావం గ్రహించి శాంతంగాను, న్యాయంగాను ఆలోచించి విమర్శచేయడం లేదేమోనని అనిపిస్తోంది. రెండువైపులా కూడా extreme గా పోతున్నారు. నాకు తెలిసినంతవరకు Andhra University ని గురించి మాట్లాడబోతున్నాను. Vice-chancellor' election, University bodies యొక్క కాలపరిమితి, యివి ముఖ్యమైన మార్పులు. ఇవి ఉండ తగినవా, ఉండకూడనివా అనే విషయాన్నిగూర్చి మనం జాగ్రత్తగా చర్చించాలి. మొట్టమొదట University Meeting లో కూడా University autonomy కి భంగమేమో అనుకున్నాను. కాని సరిగా ఆలోచించిన తరువాత రాధాకృష్ణన్ కమిటీ రిపోర్టు చూచి, యింకా కొందరి అభిప్రాయాలుచూస్తే autonomy కి ఏమీ భంగంలేదు. గవర్నరుగారు అనే విషయం తీసుకోబట్టి ఇక్కడ మనం పొరపాటు పడుతున్నాం. గవర్నరుగారికి గవర్నమెంటుకు సంబంధం ఉంటుంది కాబట్టి గవర్నమెంటు ఏదో మన నెత్తిన రుద్దుతున్నదనే అభిప్రాయానికి వస్తున్నారు. గవర్నరుగారే ఛాన్సలరు. కాని వారి duties అక్కడ వేరు. గవర్నరుగా అక్కడ వ్యవహరించరు. Chancellor కు గవర్నమెంటుకు సంబంధం ఉన్నది అనుకోవడం పొరపాటు. Chancellor కు University కి సంబంధం. గవర్నరుకు గవర్నమెంటుకు సంబంధం. గవర్నరు University కి Government కి యీ రెండింటికీ సంబంధించి ఉండడంవల్ల ఈ పొరపాటు అభిప్రాయం వాళ్ళ మనస్సులలో కలిగి గాభరాపడుతున్నారని నేను అనుకుంటున్నాను. Chancellor University లో ఒక భాగమే కాబట్టి Chancellor కొంత అధికారాన్ని తీసుకున్నా కూడా autonomy కి భంగం కాదు అనేది పూర్తిగా అర్థం చేసుకోవచ్చు.

కాకపోతే యిదివరకు election ఉండేది. ఇప్పుడు ఒక కమిటీని వేసుకొని ఆ కమిటీ పంపిన panel నుంచి గవర్నరు nominate చేయాలని ఉన్నది. దానికి గవర్నమెంటు చెప్పినట్లు వింటారేమో, పూర్తిగా political గా తయారవుతుందేమో, అధికారం అంతా గవర్నమెంటు తీసుకుంటుందేమో నని పొరపాటుగా అభిప్రాయ పడుతున్నారు. వారు గవర్నమెంటుకేమీ refer చేయనక్కరలేదు. Chancellor గారు Government కు refer చేయవలసిన

అవసరమేలేదు. కాబట్టి ఇది పూర్తిగా పొరపాటు అభిప్రాయం అని గ్రహించుకుంటే యింత తీవ్రంగా వాదోపవాదాలు జరగవేమోనని నేను అనుకుంటున్నాను. ఇంతవరకు ఆంధ్ర యూనివర్శిటీలో elections ప్రకారమే జరుగుతూ ఉన్నది. ఇక ఇప్పుడు ఒక కమిటీని వేయడము, Senate యిద్దరు మెంబర్లను గవర్నరుగారు ఒక మెంబరును వేసిన కమిటీలోనుంచి ముగ్గురు panel రావడమూ, దానిలోనుంచి ఒకరిని గవర్నరు nominate చేయడము జరుగుతుంది. ఇప్పుడు అన్నీ పూర్తిగా democratic గా తయారవుతున్నాయి. ఎవరుబడితే వాళ్ళు నిలబడవచ్చు. అట్లా నిలిచినందువల్ల సరైనవారు రాకపోయినట్లయితే University కి ప్రమాదం ఉంటుందనే అభిప్రాయంతో యిలాటి amendment తీసుకురావలసివచ్చినది. సాధారణంగా జరగకపోవచ్చు, University లో చదువుకొన్నవాళ్ళు, చాల బుద్ధిమంతులు, University బాగుకోరేవాళ్లే ఉంటారు కాబట్టి సరైనవాళ్ళనే ఎన్నుకుంటారు అనే చెప్పవచ్చు. గత 30 ఏళ్ళ అనుభవంలో యింతవరకు పొరపాటు జరగలేదు. కాని ఎప్పుడు అట్లా ఉంటుందని మనం అనుకోడానికి వీలులేదు. రాష్ట్రంలోని విద్యనంతాకూడా చేతుల్లో పెట్టుకొని సరిగ్గా జరపవలసిన University ఎక్కడ పాడైపోతుందో అన్న అభిప్రాయంతో ఈ amendment పెట్టారు. కాకపోతే మంత్రిగారు బిల్లు ప్రవేశపెట్టేటప్పుడే ఎందువల్ల ఈ amendment తీసుకురావలసివచ్చినదో వివరంగా చెప్పిఉన్నట్లయితే యింత పొరపాటు అభిప్రాయంపడడానికి అవకాశం ఉండేది కాదు. వివరించి చెప్పకపోవడం వల్ల సరైన విషయాలు తెలియక ఆందోళన పడుతున్నారు అని నేను అనుకుంటున్నాను. మొట్టమొదట నేనుకూడా ఆవిధంగా అనుకునే యిప్పుడు దీనివల్ల ప్రమాదంలేదు అనుకుంటున్నాను. రాధాకృష్ణన్ లాంటివారు ఈ మాదిరిగా election ల వల్ల ప్రమాదం ఉంటుంది అని భావించారు. Election లలో ఈ పార్టీ అని ఆ పార్టీ అని ఒత్తిడితీసుకొచ్చి తప్పుడువిధంగా election జరుపుతారు కాబట్టి ఏ University లో ఎక్కడా కూడా election పద్ధతిలేదు. అటువంటిది లేకుండా మూడు విషయాలు సూచించారు. ఈవిధంగా ఒక కమిటీని వేసి దానిలోనుంచి nominate చేస్తే సరిగా ఉంటుందని అనుకొన్నారు. ఒక పెద్ద కమిటీకి Chairman గా ఉన్న రాధాకృష్ణన్‌గారు—వారు politician కారు—చెప్పిన విషయాన్ని స్వీకరించడానికి అనుమానం ఏమి ఉండకూడదు. దానివల్ల పెద్ద నష్టం ఏమీ ఉండదనే నేను అనుకుంటున్నాను. ఇక రెండవ మార్పు : University body యొక్క కాలపరిమితి 3 ఏళ్ళ నుంచి 5 ఏళ్ళకు చేశారు. దానిలో కూడా పెద్ద నష్టం ఏమీ ఉండదు. Donations గురించి వ్యతిరేక పక్షంవారు ఎక్కువగా చెప్పు

తున్నారు. Osmania University గురించి చెప్పడంలేదు. ఆంధ్ర యూనివర్శిటీలో మాత్రం యిప్పుడున్నదానివల్ల ఏమి నష్టంలేదు. కొంతమంది దీనిని కొంచెం వక్రంగా రూపొందిస్తున్నారు. లక్ష రూపాయలు యిచ్చినట్లయితే యింతమందిని పంపించవచ్చు, University ని కొనేయవచ్చు అన్నమాట పొరపాటు. 25 వేల రూపాయలు పైన యిచ్చినవారు member గా ఉండవచ్చు అన్నారు. అంతేగాని, లక్ష రూపాయలు యిస్తే నలుగురిని పంపవచ్చు, 30 మందిని పంపవచ్చు అని లెక్కలు చెబుతున్నారు. ఆవిధంగా వీలులేదు. అసలు ఆ ప్రొవిజనే లేదు. లేనిదే ఎందుకు అల్లా అర్థంచేసుకుంటున్నారో నాకు అర్థంకావడంలేదు, University మీద అభిమానం ఉన్నవాళ్లే ఈ donations యిస్తారు. డబ్బు ఊరికే ఏమిలేదు. డబ్బుతో అనేక విషయాలు చేసుకోవచ్చు. ఎందుకు ఈవిధంగా University మీద యిన్ని లక్షలు ఖర్చుపెడతారు? విద్య అంటేను, University అంటేను అభిమానం ఉన్నవాళ్లే, విద్యాభివృద్ధి కావాలనుకున్నవాళ్లే దీనికి కొంత డబ్బు యిస్తూఉంటారు. Politics లాగా దీనిమీద డబ్బు ఖర్చుపెట్టి యింతమంది మెంబర్లను పంపుతాము. Vice-Chancellor పదవి మనవాడికి వస్తుంది అనే ఉద్దేశ్యంతో పంపడం, పంపుతారనుకోవడం పొరపాటు. ఎవరో అభిమానం ఉన్నవాళ్ళు ఒకరిద్దరు వస్తారు. సాధారణంగా రానేరారు. ఎక్కువ interest కూడా తీసుకోరు. డబ్బు యిచ్చినందుకు member గా ఉండేలాగా వారిని మనం గౌరవిస్తాము. కాబట్టి దానివల్ల వేరుగా అభిప్రాయ పడవలసిన అవసరంలేదు.

చెన్నారెడ్డిగారు మాట్లాడుతూ విద్యార్థులకు కూడా ప్రాతినిధ్యం యివ్వాలి అన్నారు. అది చాల పొరపాటు. University లలో విద్యార్థులకు కూడా ప్రాతినిధ్యం యిస్తే మనమందరము మెదలకుండా యిండ్లలో కూర్చోవచ్చు. విద్యార్థులు చదువుకోవలసినవాళ్ళు. విద్యార్థులుగా ఉన్నంతకాలము వాళ్ళు పెద్దవాళ్ళు చెప్పినట్లు ఒక discipline లో ఉండవలసిన వాళ్ళేగాని వాళ్ళను తీసుకొచ్చి Syndicate లో పెట్టడమనేది చాల విపరీతమైన విషయం. Syndicate లో examiners ను నియమించాలి. వాళ్ళు చేసేపొరపాట్లమీద క్రమశిక్షణ తీసుకోవాలి. ఇంకా అనేకం confindetial గా జరగవలసిన విషయాలు ఉన్నాయి. అసలు యిదంతాకూడా students కు సంబంధించినదే. students ను ఏవిధంగా పరీక్షలో pass చేయించాలి, ఏవిధంగా అభివృద్ధిలోకి తీసుకురావాలి, మొదలైన విషయాలన్నీ పరిశీలన చేయాలి. అటువంటప్పుడు Syndicate లో students ను కూడా members గా పెట్టాలి అనడంలో వారు దీనిని గురించి బాగా ఆలోచించే అన్నారో లేక students కు ఏదో

ఘనత యివ్వాలనే ఉద్దేశ్యంతో అన్నారో నాకు అర్థంకావడం లేదు. కాని అదిమాత్రం పూర్తిగా ఎవరూ కూడా అంగీకరించకూడని విషయం. ఇంకా ఏవైనా మార్పులు చేయవలసిఉంటే Select Committee లో చేయవచ్చు. చేస్తారు. Government వారు పెట్టారు కాబట్టి ప్రతిపక్షంవారు వ్యతిరేకించడం, ప్రతిపక్షంవారు చెప్పారు కాబట్టి ఒప్పుకోకపోవడం ఈ రెండు లేకుండా జాగ్రత్తగా అన్ని విషయాలు సమగ్రంగా ఆలోచించి University అభివృద్ధిలోకి రావాలనే ఉద్దేశ్యంతో యిది తీసుకువస్తారని, మెంబర్లందరు కూడా వాళ్ళ వాళ్ల విధులను నిర్వర్తించుకుంటారనే అభిప్రాయంతో నేను దీనిని support చేస్తున్నాను.

శ్రీ ఎస్. వేమయ్య : అధ్యక్షా, ఈ మూడు University బిల్లులమీద ఇప్పుడు జరుగుతున్నటువంటి చర్చలో చాలమంది మిత్రులు మాట్లాడారు. నేనుకూడా ఒకటి, రెండు విషయాలు మీద్వారా ప్రభుత్వ దృష్టికి తీసుకు వస్తున్నాను. పదే పదే యితర మిత్రులు చెప్పినవిధంగా ఈ బిల్లు ఆశాజనకంగా గాని, విద్యావేత్తలు అభినందించే విధంగా గాని ఎంతమాత్రము కనబడడం లేదని నేను భావిస్తున్నాను. శాసనసభలోనే కాకుండా బైటకూడా యిటువంటి వాతావరణమే ఈ బిల్లును చూచినవెంటనే కలిగిందని నేను అభిప్రాయ పడు తున్నాను. ఇటువంటి వాతావరణాన్ని తొలగించడం అవసరమని ప్రభుత్వం ఇప్పటికైనా గుర్తించాలి. ఈ nominations పద్ధతిని విరమించుకొన్నట్లయితే ప్రజాస్వామిక పద్ధతిలోనే ఈ బిల్లులున్నాయని ప్రజలుగాని, విద్యావేత్తలుగాని సభ్యులుగాని అనుకోడానికి అవకాశం ఉంటుంది. అప్పుడు వారంతా ప్రభుత్వాన్ని అభినందిస్తారు. కాని, దానికి స్వస్తిచెప్పకపోయినట్లయితే, ప్రజలకు ఆమోద కరంగా ఉండదు. విద్యావేత్తలకు ఎంతమాత్రం కూడా అంగీకారయోగ్యం కాదు. అభివృద్ధి చెందుటకు ఆశాజనకంగా ఉండదు. విద్యామంత్రిగా ఉన్న పట్టాభిరామారావుగారు ఇదివరకు వెంకటేశ్వర యూనివర్శిటీ బిల్లు వచ్చి నప్పుడు తగినమార్పులు తెస్తామని ఒక assurance ఇచ్చారు. అప్పుడు బిల్లుమీద సమగ్రంగా చర్చజరిగింది. ఓటింగు జరిగింది. ఆ సమయంలోనే వారు assurance ఇచ్చారు, ఇప్పుడు మాత్రం ఏ మార్పులూ తీసుకురావడంలేదు. ఇక మీదట తీసుకువస్తాము అని చెప్పారు. మిగతా విషయాలలో నేను వారిని అభినందించ లేను కాని scheduled castes వారికి ఇక మీదట అవకాశం కలిగేటట్లు చేస్తా మన్నారు. Scheduled Castes people కూ, Tribes కూ representation చూపించారు. అంతవరకూ వారు అభినందనీయులే. అయినప్పటికీ, ఆ చూపిన విధానం ఎంతమాత్రంకూడా సమంజసముగా లేదు. అవసరమైన మనుష్యులు

రావడానికి ఎంతమాత్రమూ ఆస్కారం లేనివిధంగా ఇది ఉన్నది. ఇది ఈ చేతితో ఇచ్చి, ఆ చేతితో పీకేసినవిధంగా కనబడుతోంది. అంతేకాని, ఉపయోగకారిగా ఉండేవిధంగా కనబడుటలేదు. అప్పుడు nominations పద్ధతిలో కూడా నేను ప్రభుత్వానికి ఒక పద్ధతి సూచించదలచాను. Nominations కంటే proportional representation అయితే మంచిది. అయితే, ఈ సందర్భంలో వారు ఒక విషయం గుర్తుపెట్టుకోవాలి. M. L. As అంతాకలిసి vote చేయాలనే విధానం కాకుండా, ఈ సభ్యులలోని హరిజన సభ్యులను హరిజనులుమాత్రమే ఎన్నుకొనేటట్లు చేసినట్లయితే అవి సక్రమంగా ఉంటుంది. కాబట్టి ఇప్పటికైనా ప్రభుత్వం అట్టి నిర్ణయం తీసుకోవాలని కోరుతున్నాను. లోగడ వారు ఇచ్చిన assurance ఫలించాలంటే తప్పకుండా proportional representation ఇవ్వాలి. ఇది ప్రభుత్వం గుర్తించాలని కోరుతున్నాను.

ఇప్పుడు Council వచ్చినప్పుడు Teachers' Costituency లో Secondary grade Teachers కు కూడా ఓటింగు హక్కు ఇస్తున్నారు. కాని, Secondary grade pass అయినవారు Elementary schools లో పనిచేస్తున్నట్లయితే, వారికి ఓటింగు హక్కు లేదని చెబుతున్నారు. Secondary Schools లో ఉంటేనే తప్ప Higher Elementary Schools లో ఉన్నా, Elementary Schools లో ఉన్నా వారికి ఓటింగుహక్కు లేకుండా చేయడం ఎంతమాత్రం బాగుండలేదు. వారు సెకండరీ గ్రేడు టీచర్సు అయివుండి కూడా Elementary School లో పని చేస్తున్నందువల్ల వారికి ఓటు హక్కు లేకుండాచేయడం మంచిది కాదు. Secondary School లో గాని, Elementary School లో గాని ఉన్నటువంటి వారికి ఓటింగు హక్కు ఇవ్వాలి. Graduates కు ఇచ్చినవిధంగానే Teachers కు representation ఉండాలి. వారు ఎన్నుకొనే విధంగా ఉండాలి. Secondary grade వారు Elementary School లో పనిచేస్తున్నారు. వారికి Secondary grade scales ఇవ్వడమే కాకుండా Teachers' constituency అన్నప్పుడు teachers అందరూ ఉండేటట్లు చేస్తే చాలా అభినందనీయంగా ఉంటుంది. 'Teachers' అన్నప్పుడు వారు Elementary School teachers అయినా, higher grade వారయినా lower grade వారయినా టీచర్సే కాబట్టి వారందరికీ కూడా ఓటింగుహక్కు ఉండాలి. కాబట్టి Graduates కు ఇచ్చిన విధంగానే 20 మంది teachers కు అవకాశం ఇవ్వాలి. అట్టడుగున ఉన్న చిన్న బాలబాలికలకు విద్య నేర్పుతారు వారు. వారు కౌన్సిలులో ఉంటే ప్రభుత్వానికీ, అక్కడ ఉన్న విద్యాశాఖలకూ ఉపయోగపడతారని మనవిచేస్తున్నాను. ఇప్పటికైనా ప్రభుత్వంవారు గుర్తించి, proporational repsesentation ప్రకారం వారందరికీ

ఓటింగు హక్కు ఇచ్చి teachers నుంచి ఎన్నికలు జరిపే విధానం అవలంబించాలని మనవిచేస్తున్నాను.

ఇతరసభ్యులు చెప్పినవిధంగానే, డబ్బుఇచ్చి ఓటింగు సంపాదించుకొనే విధానంమాత్రం మంచిదికాదు. దానిని నేను వ్యతిరేకిస్తున్నాను. దానిని ప్రభుత్వం సడలించాలి. డబ్బుఇచ్చి కొనుక్కునే ఓటింగు విధానం, సబబుగా ఉండదు. పంచాయతీలనుంచీ, మునిసిపాలిటీలనుంచీ nominations చేసేవిధానం కనబడుతోంది. ఇది ఎంతమాత్రమూ పనికిరాదు. ఇక్కడకూడా representation ప్రకారం ఎన్నికలద్వారానే రావాలని మనవిచేస్తున్నాను. పంచాయతీబోర్డు ప్రెశిడెంటులకు మాత్రమే ఇందులో ఓటింగుహక్కు ఇచ్చారు. ప్రెశిడెంటులకు ఇచ్చి మిగతా మెంబరులకు లేకుండా చేయడం సబబుకాదు. ప్రెశిడెంటుకూ, మెంబర్లకూ కూడా ఓటింగుహక్కు యీయడంన్యాయం. వారిద్వారా ఎన్నుకోబడిన మెంబర్లను సెనేటులో వేసినట్లయితే బాగుంటుంది. Nomination చేసే పద్ధతి ఎంతమాత్రమూ బాగుండదు. విద్యావిధానంలో ప్రధానపాత్ర ఉపాధ్యాయులది. కాబట్టి వారివిషయం మరొకసారి ప్రభుత్వదృష్టికి తెస్తున్నాను. వారందరికీకూడా ఓటింగుహక్కు ఇచ్చి, ఎన్నికలద్వారా సెనేటుకు వచ్చే విధానం అవలంబించాలని మనవిచేస్తున్నాను. ఈ విషయం ప్రభుత్వం దృష్టిలో పెట్టుకోవాలి. సెలక్టు కమిటీలో సభ్యులు ఇవి గమనించేటట్లు చేయాలని మనవి చేస్తూ నేను సెలవుతీసికొంటున్నాను.

శ్రీ ఎన్. సి. శేషాద్రి (రాయదుర్గం) : అధ్యక్షా, విద్యామంత్రిగారు ప్రవేశపెట్టిన ఈ సవరణ బిల్లులవిషయమై రెండు రోజులుగా అనేక విధాలైన arguments మరియు counter-arguments జరుగుతున్నాయి. అయితే, విద్యావిధానంలో fundamental గా మార్పులు తీసుకువచ్చేటప్పుడు దానికి రెండువైపుల arguments ఉంటాయి. కొన్ని విషయాలు కొందరికి reasonable గా తోచినట్లయితే, మరికొందరికి అందులో ఏవో లోట్లు కనిపించడం, అవి ఏమీ సరిగాలేవు అని వారు భావించడం- ఇవన్నీకూడా మామూలే. అయితే, చాలాకాలం క్రిందట డాక్టర్ రాధాకృష్ణన్ విద్యావిధానంలో కొన్ని ముఖ్యమైన విధానాలను సూచించారు. అందులో ఎన్నిక పద్ధతి రద్దుచేయాలనే విషయంలో "ఎన్నిక పద్ధతి ఉండడంవల్ల అనేకవిధాలైన politics అతి పవిత్రమైన విద్యాసంస్థలో ప్రవేశించడంవల్ల విద్యా విధానం అంతా దెబ్బతింటుంది. విద్యకు సరైన ప్రోత్సాహం ఉండదు" అని చాలా మంది ప్రముఖ విద్యావేత్తలుకూడా చెబుతున్నారు. ఆ తరువాత University

Grants Commission చేసిన ముఖ్యమైన సూచనలలో అదికూడా ఒకటై యున్నది. నామట్టుకు నేను personal గా, యూనివర్శిటీలో elections పద్ధతి రద్దుకావాలనే విషయాన్ని పూర్తిగా నమ్ముతూ వచ్చినవాడనుకాబట్టి, ఈ కొత్త సంస్కరణ తెచ్చినందులకు ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. అయితే, 'ప్రజాస్వామ్యం' అనే పేరుతో ఏ bodies లో ప్రజాస్వామ్యపద్ధతి నడులు జరపాలి; ఏ bodies లో జరుపకూడదు అనే విచారణలేకుండా అన్నిటికీ ప్రజాస్వామ్యాన్నే yardstick గా తీసుకొని కొల్చుకొంటూ వెళ్ళినట్లయితే, ఇప్పుడు ప్రపంచంలో తగ్గిపోతున్న నైతిక విలువలను చూసినట్లయితే, అసలు అతి పవిత్రమైన విద్యాసంస్థలలో యీ ప్రజాస్వామికపద్ధతినే అవలంబించి నట్లయితే, వాటియొక్క నైతిక విలువలను సక్రమంగా నిలబెట్టుకొగలవా, లేదా అనే విషయాన్ని మనం అందరం తీవ్రంగా ఆలోచించవలసియున్నది. ఈ ఎన్నిక పద్ధతి రద్దు కావడంవల్ల యూనివర్శిటీలు బాగా చక్కబడతాయనీ, ముందుముందు విద్యాభివృద్ధికి బాగా తోడ్పడతాయనీకూడా నేను భావిస్తు న్నాను. అయితే, ఈనాడు ఇది ముఖ్యమైన చర్చనీయాంశంగా బయలుదేరింది. Election పద్ధతిని రద్దుచేయడంవల్ల ప్రజాస్వామ్యానికి మనం దెబ్బతీస్తున్నామనే ఉద్దేశం కొంతమందికి కలగడం సహజమే. అయినప్పటికీ ప్రముఖ విద్యావేత్త లతోకూడిన University Grants Commission సిఫార్సులవల్ల నైతేనేమి, ప్రముఖ విద్యావేత్తగా అందరికీ తెలిసిన డాక్టర్ రాధాకృష్ణన్ సలహాలవల్ల నైతేనేమి, ఎన్నిక పద్ధతిని మార్చి కొత్తవిధానాన్ని అమలుపెట్టడంవల్ల విద్యా భివృద్ధికి మన యూనివర్శిటీలు చక్కగా ఉపయోగపడతాయని నా ఉద్దేశ్యం. "విద్యావేత్త లెవ్వరూ దీనిని అభినందించడంలేదు; ప్రభుత్వం ఏదో కొత్తపద్ధతిని తీసుకువచ్చి ప్రవేశపెట్టింది" అని ప్రతిపక్ష సభ్యులు మాట్లాడడం జరిగింది. వారికి అట్టి అభిప్రాయం ఉండవచ్చును. కాని, విద్యావేత్తలెవరూ అభినందించడంలేదు అనే విషయంతో నేను ఏకీభవించడంలేదు. కొత్తవిధానాన్ని తీసుకురావాలని ప్రముఖ విద్యావేత్తలుగల Delhi University ప్రయత్నంచేసింది. ఆ కృషిలో వారు అక్కడ successful అయినట్లు మనకు తెలిసింది.

ఈరోజున ఎక్కడనుంచో సరిక్రొత్త పద్ధతి తీసుకొనివచ్చి dangerous experiment చేస్తున్నారని కొంతమంది భావిస్తున్నారు. అలా భావించనవసరం లేదు. ముందు ముందు విపరీతమైన పరిణామాలకు దారితీ స్తవనే అనుమానం అక్కరలేదు. ఈ పద్ధతి కొన్ని విశ్వవిద్యాలయాలలో ప్రవేశపెట్టారు. ఈ సంస్కరణ వల్ల విద్యాబోధనలో వివిధమైన లోటుపాట్లు లేకుండా, సక్రమంగా జరుగుతున్నదని చాలమంది విద్యావేత్తలు ఒప్పుకొన్నారు. కొంతమంది

మిత్రులు ప్రజాస్వామిక పద్ధతులకు వ్యతిరేకమన్నారు. నేను యింతకుముందే చెప్పినట్టుగా ప్రజాస్వామికం అనేటటువంటి పద్ధతి ఏ మ్యునిసిపల్ కౌన్సిల్ లోనో, పంచాయితీలలోనో, అసెంబ్లీలోనో ఉంటే బాగుంటుందేమో కాని, విద్యాసంస్థలలోనూ, యూనివర్శిటీలలోనూ ఆ ప్రజాస్వామిక పద్ధతి ప్రవేశపెట్టినట్లయితే- ఆ ప్రజాస్వామికపు హద్దులు ఎంతవరకు పోతున్నవో ఊహించడానికి వీలులేకుండా ఉన్నది. అసలే మన దేశంలో విద్యావంతులు చాలా తక్కువగా ఉంటున్న సందర్భంలో విద్యాసంస్థల్లో కూడ ప్రజాస్వామిక పద్ధతులలో ఎన్నికలు జరిపి, మెంబర్సును ఎన్నుకొని, లోకల్ బాడీస్ నుండి, పంచాయతీ కమిటీల నుండి విద్యా సంస్థలకు ఓటుచేయాలనే పద్ధతి అమలులో పెట్టినట్లయితే మన ప్రజాస్వామికాన్ని ఏ heights కు తీసుకొనిపోతున్నామో ఊహించలేకుండా ఉన్నాము. దీనివల్ల మన దేశానికి మేలే కలుగుతుందో, చెడే కలుగుతుందో ఆలోచించడానికి వీలులేకుండా ఉన్నది. ఈ ప్రజాస్వామికపద్ధతి విద్యాసంస్థలలో పెట్టినట్లయితే, అది dangerous experiment అవుతుందనే అనుమానం నాకు ఉంది. తరువాత ఉస్మానియా ఛార్టరును సంస్కరించి, దానిస్థానంలో క్రొత్త దానిని తీసుకొనివచ్చే సందర్భంలో ఒక కేబినెట్ మంత్రిగారు కొన్ని హామీలు యిచ్చారని, ఆ హామీలను ఈ క్రొత్త ఛార్టరును తయారుచేయడంలో represent చేయలేదని చెప్పడం జరిగింది. దురదృష్టవశాత్తు వైస్‌ఛాన్సలర్ నియామకంలో కొన్ని misunderstandings ఏర్పడడం వల్ల, మంత్రిగారు వేంకటేశ్వర విశ్వ విద్యాలయంలో ఉన్న పద్ధతులనే యిక్కడ కూడ అమలుపెట్టెదమని హామీ యివ్వడం జరిగింది. వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఉన్న పద్ధతిని కూడ మార్చడంవల్ల ఉస్మానియా, వెంకటేశ్వర విశ్వవిద్యాలయాలలో ఒకే పద్ధతిని ప్రవేశపెట్టవలెనని 'వకాలతు తీసుకున్నారా' అని మంత్రిగార్ని విమర్శించడం జరిగింది. అది న్యాయమైన విమర్శ కాదని నేను భావిస్తున్నాను ఎందుకంటే కేవలం ఉస్మానియా విశ్వ విద్యాలయంలో ఈ విధమైన సంస్కరణ ప్రవేశ పెట్టాలని ఉద్దేశ్యముతో వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో కూడ ఈ విధమైన మార్పు తీసుకొనిరావడం జరిగిందని, లేకపోతే వెంకటేశ్వర విశ్వవిద్యాలయం లో మామూలుగా ఎన్నికల పద్ధతే ఉండేదనే విషయాన్ని నేను మాత్రం ఒప్పుకోవడంలేదు. ఈ విషయం చాలా కాలంగా డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు చెబుతూ వచ్చేవారు. ఆంధ్ర, వెంకటేశ్వర విశ్వవిద్యాల యాలలో ఎన్నికల పద్ధతి రద్దు చేయాలన్న విషయం మంత్రివర్గ సభ్యులకే కాకుండా, అనేకమందికి ఇదివరలోనే తెలుసు. ఈ ఉస్మానియా విశ్వవిద్యా లయం సంగతి ఇప్పుడు రాకున్నా, అక్కడ ఈ మార్పులు జరిగేవి. ఈ

సందర్భంలోనే ఉస్మానియా ఛార్టరునుకూడ మార్చవలసి వచ్చింది. కాబట్టి, క్రొత్తవిధానాల్ని ప్రవేశపెడితే బాగుంటుందని ప్రవేశపెట్టారు. అంతే తప్ప ఉస్మానియా ఛార్టరును అమెండు చేస్తున్నాము కాబట్టి దానిని సమర్థించుకోడానికి ఆంధ్ర, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయాలలో కూడ మార్పులు తలపెట్టారన్న విమర్శ సరియైనది కాదని తమద్వారా సభ్యులకు మరొకసారి మనవి చేస్తున్నాను. ఇదివరలో కర్నూలులో ప్రభుత్వం ఉన్నప్పుడుకూడ ఈ యూనివర్శిటీ **subject** వచ్చినప్పుడు, వైస్ ఛాన్సలర్ పోస్టుకు **election** ఉండాలా అక్కరలేదా అన్న విషయంపై చర్చలు జరిగినవి. చాలమంది సభ్యులు అది ఎలక్టివ్ పోస్టుగా ఉండడంవల్ల, విశ్వవిద్యాలయాలు రాజకీయాలకు నిలయమౌతుందని, ఉన్నతమైన ఆశయాలకు భంగముగలుగుతుందేమో అన్న అభిప్రాయాన్ని వ్యక్తపరచడంకూడ జరిగింది. కాబట్టి ఏదో అవకాశం కల్పించుకుని మంత్రిగారు యిచ్చిన హామీలనుండి తప్పించుకోడానికి పన్నాగం పన్నారని అనడానికి వీలులేదు. ఇదివరకటినుంచి చాలా రోజులుగా అనుకుంటున్న విధంగానే ఈ మార్పులు తీసుకొనివచ్చారు. ఈ మార్పులు ఈ మూడు విశ్వవిద్యాలయాల భావి అభివృద్ధికి తోడ్పడుతుందని నేను భావిస్తున్నాను.

తరువాత సెనేటుకు మెంబర్సును ఎన్నుకొనేవిషయంలో "అంతా నామినేషన్‌మీదనే జరుగుతున్నది. ఆ నామినేషన్ అయినా ప్రభుత్వానికి యిష్టం అయినవారినే చేయవచ్చు, ఇందులో వెస్టెడ్ ఇంటరెస్టు ఉం"దని అంటున్నారు. ఈ పద్ధతివల్ల "ఏ **Interest** ను అయితే **represent** చేయాలని చూస్తున్నారో, అది సరిగా, సక్రమంగా, న్యాయంగా అమలు జరుపడానికి వీలు ఉండ"దనే సందేహాన్ని కొంతమంది సభ్యులు వెలిబుచ్చారు అటువంటి సందేహానికి ఏమీ ఆస్కారంలేకుండా సెనేటులోకూడ ఎలక్షన్ పద్ధతి ఉంది. గ్రాడ్యుయేట్సునుంచి, M. L. A. ల నుంచి, మ్యునిసిపాలిటీలనుంచి, పంచాయితీలనుండి సెనేటుకువచ్చే మెంబర్లు ఎలక్షన్ ద్వారానే వస్తారు. కేవలం **"Six persons nominated by the Chancellor, of whom three shall be from among the Municipal Councillors"** అనిమాత్రమే చెబుతున్నారు. తరువాత పది నామినేషన్సులో షెడ్యూల్డు కాస్టులకు ౩; షెడ్యూల్డు ట్రైబ్సుకు ఒకటి; టీచర్లకు ౬ నామినేట్ చేయాలని ఉంది. ఇంతవరకు ఉపాధ్యాయులకు రిప్రజెంటేషన్ లేకుండా ఉన్నది. క్రొత్తగా ఉపాధ్యాయులకు రిప్రజెంటేషన్ యివ్వడం సంతోషించదగిన విషయం. యూనివర్శిటీలకు డబ్బు యిచ్చేటటువంటి వ్యక్తులను మెంబర్సుగా చేర్చి, ఓటింగుహక్కు యివ్వడం న్యాయం కాదని కొంతమంది సభ్యులు అభిప్రాయం వెలిబుచ్చారు. నాకు తెలిసినంత

వరకు 25 వేల రూపాయలు విరాళంగా యిచ్చినవారికే అటువంటి సదుపాయం కల్పించబడుతోంది. మనకు తెలిసినంతలో 25 వేల రూపాయలు యూనివర్శిటీలకు విరాళంగా యిచ్చేవారు బహు అరుదుగా ఉంటారు. ఈ పద్ధతి ప్రవేశపెడితే "యూనివర్శిటీని అంతా ధనికవర్గంవారు కొనుక్కుంటారు. వారే యూనివర్శిటీ కార్యక్రమాన్ని నిర్వహిస్తారు. కాబట్టి విశ్వవిద్యాలయాలు రాజకీయాలకు నిలయం అయిపోతుం"దని కొంతమంది అన్నారు. ఈవిమర్శ కేవలం దాతలను కించపరచడమేతప్ప మరొకటికాదు. యూనివర్శిటీలమీద, యూనివర్శిటీ విద్యమీద అభిమానం ఉన్నవారు ఎవరో, కొద్దిమందే రాజకీయాలతో సంబంధంలేనివారే ఈ విరాళం యిస్తారుగాని అందరు యివ్వరు. రాజకీయాలతో సంబంధంలేనివారు ధారాళంగా విరాళం యిస్తున్నప్పుడు "యూనివర్శిటీని పరిపాలించడానికి వచ్చా"రని విమర్శించడం న్యాయంకాదు. అలాగే అకడమిక్ కౌన్సిల్, సంగీత నాటక అకడమీ, సాహిత్య అకడమీ అధ్యక్షులకు సభ్యత్వం యివ్వడాన్ని కొందరు విమర్శించారు. వీరిని ప్రభుత్వం నామినేటుచేస్తుంది. ఇది "ప్రజాస్వామిక సూత్రాలకు వ్యతిరేకం" అన్నారు కొంతమంది. మనకు తెలిసినంతవరకు ఈరోజున రిప్రజెంటేషన్ యిస్తూన్నటువంటి అకడమీ అధ్యక్షులు ఆయా ఫీల్డ్సులో సరియైన అనుభవం కల్గినవారే అని చెప్పవచ్చు. అటువంటి వారు సెనేటులో ఉండడంవల్ల సెనేటుయొక్క **Constitution** బలపడుతుంది. సెనేటుయొక్క స్థాయి పెరురుతుందని నేను భావిస్తున్నాను. కేవలం ప్రభుత్వం నామినేటు చేసినవాళ్లు అయినంత మాత్రాన, వారికి సరియైనస్థాయి, యోగ్యతలులేవని భావించడంగాని, వారివల్ల విద్యావిధానస్థాయిని అభివృద్ధి పరచడానికి ఆస్కారంలేదని భావించడంమాత్రం సరియైనదికాదు. అట్లాభావిస్తే విచారించవలసిన విషయం. వారు గవర్నమెంటుచే నామినేట్ చేయబడినప్పటికి **particulor fields** లో యోగ్యతగలవారినే ఎన్నుకోవడం జరుగుతుంది. కాబట్టి అలాంటివారు సెనెట్‌లో ఉంటుటవల్ల యూనివర్సిటీకి ఏవిధమైన కష్టము కలుగకపోవుటేగాక వారినుండి సెనెట్ బాగుపడే అవకాశాలు చాలా ఉన్నవని నేను భావిస్తున్నాను. ఇంకా ఏమైనా చిన్నచిన్న లోటుపాట్లు వున్నా సెలెక్టుకమిటిలో సరిచేసుకోవచ్చును. సెలెక్టు కమిటీనుండి త్వరలోనే శాసనసభ ముందుకు ఈ బిల్లు వస్తుందనీ; క్రొత్త సంస్కరణల ప్రకారం అమలుజరిపి మన విద్యా విధానాన్ని బాగా పెంపొందించుకోగలమని ఆశిస్తూ సెలవు తీసుకుంటున్నాను.

*శ్రీ జె. ఆనందరావు (మెట్‌పల్లి) : అధ్యక్షా, నిన్నటినుండి ఈ బిల్లుపై చాలా చర్చలు జరిగినవి. ముఖ్యంగా వైస్ ఛాన్సలర్ పదవికి నామినేట్ చేయుపద్ధతి తగదని పలువురు వ్యాఖ్యానము చేశారు ప్రభుత్వానికి గూడ ఈ నామినేషన్ పద్ధతి తగదని తలంపు ఉన్నప్పటికి వారికి స్పష్టమైన ఆత్మవిశ్వాసం లేక డొంకతిరుగుడు మార్గంలో ఈ ప్రతిపాదనను సూచించారు ఇది నామినేషన్ మాదిరిగాను, ఎన్నిక మాదిరిగాను రెండువిధాల కనబడునట్లు **legal terms** లో ప్రవేశపెట్టారు. నామినేషన్ జరుగుతుందని స్పష్టంగా సూచించలేకపోయారు. ముగ్గురు సభ్యులతో ఒక కమిటీ ఏర్పడాలి. ఆ కమిటీలో ఇద్దరు సిండికేట్ సభ్యులు, ఛాన్సలర్ సూచించిన ఒక వ్యక్తి ఉంటారు. తరువాత ఆ ముగ్గురు మరి ముగ్గురి పేర్లను సూచిస్తే వారిలోనుండి తమ కిష్టమైన వారిని ఛాన్సలర్ నామినేట్ చేస్తారు. ఇది అంతా పిల్లలు మందు త్రాగకపోతే తియ్యగా ఉందని బుజ్జగించినట్లు ఉన్నది. దీనినిబట్టి స్పష్టంగా వ్రాయుటకు ప్రభుత్వానికి ధైర్యం లేకపోయిందని తెలుతున్నది. **The Chancellor shall nominate** అని వ్రాసిఉంటే బాగుండేది. నామినేషన్ పద్ధతి సరికాదనే భావం వారిలోకూడ ఉండుటవల్ల కూడ ఆ విధంగా వ్రాయలేకపోయారు. తరువాత నామినేషన్ పద్ధతిలోనూ ఎన్నికల పద్ధతిలోనూ లోపాలు ఉన్నవని వాదించడం జరిగింది. సామాన్యంగా ఏ పద్ధతిగూడ లోపరహితంగా ఉండదు. ఎటువంటి పరిస్థితులలో తీసుకరాబడిందో అర్థంచేసుకోవాలి. వైస్ ఛాన్సలర్ నియామకం విషయంలో ఒక అలజడి రేగడం, మంత్రులు కొన్ని హామీలు వారి కివ్వడం దానిని పురస్కరించుకొని ఈ బిల్లు ప్రవేశపెట్టబడడం జరిగింది. ఏ ఆశయం కొరకు అప్పుడు అంత ఆందోళన జరిగిందో ఆ ఆశయం నెరవేరుటలేదు. అందువల్ల వారికి అనుమానాలు ఇంకా పెరుగుచున్నవి. వాటిని పురస్కరించుకొనే మనము ఒక రీజినల్ కమిటీని వేసుకున్నాము. ఆంధ్రులం సర్వతోముఖంగా అభివృద్ధి చెందాలనే అంతా భావిస్తున్నారు. కాని యిక్కడి ప్రజలకు కొన్ని ప్రత్యేకసమస్య లున్నవి. భయాందోళనలు ఉన్నవి. ఇదివరకు చేసిన కొన్ని కమిట్‌మెంట్సును తప్పించుకొనుటకు ఈ ఒక్క యూనివర్శిటీలో మాత్రం నామినేషన్ పద్ధతిని ప్రవేశపెట్టుటకు ధైర్యం లేక మిగతావాటిలో గూడ మార్చడం జరిగింది. ఇవన్నీ మరీ ఆందోళన కల్గించేవిగా ఉన్నవి, ఈ బిల్లు సెలెక్టు కమిటీకి పోవును గాన అక్కడైనా పునరాలోచించి ఈ పద్ధతులను మార్చుకోవడం మంచిది.

ఢిల్లీ పద్ధతిని ప్రవేశపెట్టాము అని అంటున్నారు. ఢిల్లీపరిస్థితులు వేరు. ఇక్కడి పరిస్థితులు వేరు. ఢిల్లీలో ఇంటర్నేషనల్‌గా విద్యావిధానంలోనూ,

వైజ్ఞానిక రంగంలోనూ గొప్ప ఎకడమీషియన్సు ఉంటారు. ఎన్నికల పద్ధతిని ప్రవేశపెట్టిన యూనివర్శిటీ ఎన్నికల రంగస్థలమై వాతావరణం అంతా కలుషితమైపోతుం దనుకోవడం పొరపాటు. నేను ఒక చిన్న ఉదాహరణ చెబుతాను. పంచాయతి ఎన్నికలు జరుగుతాయి. అక్కడ ఉన్న రైవల్ గ్రూపున్ను బట్టి ఒకరికి కాంగ్రెస్ పార్టి అని, ఒకరికి కమ్యూనిష్టుపార్టి అని పేరు పెడతాము. వారికి ఉండే భూసమస్యలో, ఇతరమైన తగాదాలు పరిష్కారం చేస్తారనుకొన్నప్పుడు వారు పార్టీ పేరు పెట్టుకొని పోట్లాడుతారు. అంతేగాని వారికి రాజకీయాలు ముఖ్యంకాదు. ఎన్నికల పోరాటానికి వారి తగాదాలే ప్రధాన కారణం. కాని మనం రాజకీయంగా పోయి అక్కడ పోరాడుతాము. నేను గెల్వాలంటే, నేను గెల్వాలని కొట్లాడుతాము. కాని ఎవరు గెలిచినా ఎన్నికలు ఐపోగానే మనం వెంటనే మరచిపోతాము. ఒక సమస్య వచ్చినప్పుడు అంతా కలిసి పనిచేస్తాము. కాని గ్రామంలోని ఆ కక్షలు అలాగే స్థిరపడిపోతాయి వారి సమస్యలు పరిష్కారం కావు. అవి పరిష్కారం కానంత వరకు వారు కలసి మెలసి ఉండలేరు. గ్రామస్థాయి వేరు, మన స్థాయి వేరు. కాబట్టి యూనివర్శిటీలో గూడ ఎన్నికలు జరిగిన అక్కడి వాతావరణమంతా కలుషితమై పోతుం దనుకోవడం చాలా పొరపాటు. అన్ని విధాల యోగ్యత గలిగి సమర్థతతో పనిచేయగలవాడు ఇతనా, అతనా అనే బేసిస్ పైన ఎన్నికలు జరుగవచ్చు. అంతమాత్రాన ఆ దేవాలయ పవిత్రత పోయి, అపవిత్రత ఏర్పడదు. కాలేజీలలో జరిగిన ఎన్నికలకున్నూ, ఈ ఎన్నికలకున్నూ స్థాయీలలో ఎంతో భేదముంటుంది. కాబట్టి ఎన్నికలు జరిగితీరాలని నేను మనవిచేస్తున్నాను. మంత్రులకు ఏవో పట్టింపులు ఉన్నా ఇంకొక విధంగా సూచించిన బాగుండేది. ప్రక్క రాష్ట్రాలలో ఉన్న మేధావులతో ఒక కమిటీని వేసి వారావిధంగా నామినేషన్ ఉండాలని సూచించినచో మేము అర్థంచేసుకో గలిగి ఉండేవారం. ఆవిధంగాకూడా చేయకుండా ముక్కుకు సూటిగా అందరికీ తెలిసేటట్లు చేశారు. ఛాన్సలర్ నామినేట్ చేస్తారు అనేబదులు దానికి మరి 3, 4 సూత్రాలు వ్రాసి చివరకు ఆ అర్థానికే వచ్చారు. ఇక్కడి ప్రజలలోయున్న వాతావరణాన్ని దృష్టిలో పెట్టుకుని సమయోచితంగా ప్రవర్తించాలి. ఇప్పుడు ఎన్నికల పద్ధతిని పెట్టి దాని ఫలితాలను కొంతకాలం చూచి, దానివల్ల చెడు ఫలితాలు సంభవించేటట్లున్నచో మరల మనం మార్చుకొనుటకు అవకాశమున్నది.

తరువాత విరాళదారులకు ప్రాతినిధ్య మిచ్చు విషయంలో మాట్లాడుతూ కొంతమంది వారిని ఆవిధంగా ప్రోత్సహించాలని, లేనియెడల ధనం రాదని చెప్పినారు. వారు దుర్బుద్ధితో సెనెట్‌ను తమ హస్తగతము చేసుకోవాలనే

ఉద్దేశ్యంతో కాక కేవలం త్యాగబుద్ధితోనే విరాళమిస్తుంటారు, కాన వారికి సభ్యత్వమిస్తే ఏమి పోయిందని అన్నారు. అది వారిని సత్కరించినట్లు ఔతుం దని అంటున్నారు. సత్కరించుటకు, సన్మానించుటకు అనేక మార్గాలున్నవి. కాన్వొకేషన్ అడ్రెస్ సమయంలో వారిని ఆహ్వానించి, పూలమాలలచేత అలంకరించి, అందరి ఎదుట వీరు 25 వేలు విరాళమిచ్చారు ; వీరు 50 వేలు విరాళమిచ్చారు అని పరిచయం చేయవచ్చుగదా: ప్రశంసిస్తూ పత్రికలలో వారి పేర్లను ప్రకటించవచ్చు. లేక వారి పేర్లు శిలాక్షరాలుగా నిలుచునట్లు వారి పేరట లైబ్రరీనో, లేబొరేటరీనో, హాస్టలునో నిర్మించవచ్చుగదా ! సెనెట్ సభ్యులై 3 4 ఏండ్లు ఉండుట కంటె వేలాది విద్యార్థులు, వారి తల్లిదండ్రులు ముందు ఫలానావారు ఇంత విరాళమిచ్చారు, విద్యకొరకు ఇంత త్యాగం చేశారని చెప్పి గౌరవించిన బాగుంటుంది, కాబట్టి ఈ పద్ధతిని అవలంబించా లని కోరుతున్నాను.

ఇప్పుడు రిప్రజెంటేషన్ లోకల్ బాడీస్‌కు యిచ్చాము. పంచాయితీ కమిటీ మెంబర్సు అందరికీకూడ ప్రాతినిధ్యము యివ్వవలయునని కొందరి భావము. ఆవిధముగా యిచ్చినట్లయితే తిరిగి ఎలెక్షన్ గందరగోళము, డబ్బు విషయముగల చిక్కులు కొన్ని రావచ్చును. ఐతే ఎన్ని చిక్కులు వచ్చినప్పటికినీ మనము సమన్వయము చేయవలయునంటే ఆ ఎక్స్‌పెన్సెస్ కూడ తగ్గించుకొనే టట్లుగా మన ఎలెక్షన్సు సమన్వయంచేసి పార్లమెంటుకు అసెంబ్లీలకు ఎన్నికలు ఒకసారి జరుపుకొని మన ఖర్చులు తగ్గించుకుంటున్నట్లే దీనిలోకూడ కొన్ని ఖర్చులు తగ్గించేపద్ధతి అవలంబించి అందరికి కూడ ప్రాతినిధ్యము యిచ్చే అవ కాశము కలిగించుకోవచ్చును.

రిప్రజెంటేషన్ ఈ లోకల్ బాడీస్‌కు యింకా ఎక్కువ యిచ్చినట్లయితే ఏమీ నష్టములేదు. అట్లు చేయవలయునుకూడ. అందులో ఎకడమిక్ యింట రెస్టు చాల ప్రోత్సహించవలసిన విషయముకూడవుంది. వాటికి ప్రాతినిధ్యము ఎక్కువ వుంది. టీచర్సు, లాయర్సు, డాక్టర్సు వీరంతా విద్యావంతులు. ముఖ్యముగా విద్యావంతులైన ప్రొఫెసరుల వృత్తులు ఎటువంటివి వున్నవో ఈ వృత్తులవారందరికీ ఏదోవిధముగా ప్రాతినిధ్యము యివ్వవలెనని ఉద్దేశించు టకు వీలులేదు. వారందరికి ప్రాతినిధ్యము యిచ్చేటట్లుగా మనము అవకాశము కలిగించినట్లయితే దానివలన మనకు చాల లాభము కలుగుచున్నది. వారు తమ తెలివితేటలచేత, విజ్ఞానముచేత, అనుభవముచేత యూనివర్శిటీని పెంపు చేయగలుగుతారు. కాబట్టి అట్టి ప్రాతినిధ్యము ఎక్కువచేయవలెను. డబ్బు యిచ్చేవారికి ప్రాతినిధ్యము యిచ్చి ఒకవేళ అందుకు తప్పనిసరిగా గత్యంత

రము లేనట్లయితే దానిని ⅓ లేక ¼ లోనో తగ్గించివేసే సూచన ఉంది. అది సాధ్యము కాకపోయినట్లయితే ఫిక్సుడు చేసి ఇంతకంటె ఎక్కువ ఇవ్వమనేది నిర్దేశముగా వ్రాయవలెనని నేను కోరుచున్నాను.

నిన్న దీని విషయములో రావి నారాయణరెడ్డి మాట్లాడినారు. ఇది జనరల్ డిస్కషన్ గనుక నేనుకూడ ఇది అసందర్భము అని అనుకోవడము లేదు. భాష విషయములో యిప్పుడు ప్రత్యేకముగా ఒక అనుభవము అనగా ఈమాతృభాషలో హైఎడ్యుకేషన్ లేకపోవడంచేత మెట్రిక్యులేషన్ తెలుగులోనే చదువుచున్నందున తర్వాత ఇంటర్, బి. ఏ. వచ్చేవరకు చాల అవస్థలు పడుచున్నారు. స్టాండర్డు చాల తగ్గిపోయినది. లోస్టాండర్డు ఐనదని ప్రతివారు అనుకొనుచున్నారు. ఆఖరికి విసికి చదువలేకపోవుచున్నారు.

కనుక యిప్పుడు మన ఉద్దేశము ఏమిటి ? లిటరేచర్ శాస్త్ర విజ్ఞానము పెంపు కావలెననియు, టెక్నీషియన్సు, డాక్టర్సు, ఇంజనీర్సు ఎక్కువ కావలెనని కోరిక. అయితే వీరందరు పెంపు కావలెనని ఒకవైపు కోరుతూ, యింకొకవైపున అవరోధము మనము కలిగించేటట్లుగా జరుగుతుంది. దీనికి కొన్ని సాధక బాధకాలు ఉండవచ్చును. అనగా ! శాస్త్ర విజ్ఞానము సైంటిఫిక్ విజ్ఞానము అంతా ఇంగ్లీషులో ఉంది. కావున ఈ వేళ ఒకేసారి ఈ భాషను తీసివేయుటకు సాధ్యము కాదని కొంతవరకు నేను ఒప్పుకుంటాను. గాని ఒకేసారి తీసివేయుటకు వీలులేకుంటె క్రమముగా తీసివేయుటకు సాధ్యమవుతుంది.

పూర్వము నైజాము గవర్నమెంటువారు ఉర్దూలోనే జాగ్రఫీ, హిస్టరీ, సైన్సు యింకా అనేక పుస్తకాలను లక్షలు ఖర్చుపెట్టి సిద్ధము చేసినారు. ఎందుకంటె వారికి చేయవలెననే ఉద్దేశ్యము ఉండెను. అందువలన వారా ఉద్దేశ్యము నెరవేర్చ గలిగినారు.

ఈవేళ మనము అదేప్రకారము వీటిని ట్రాన్స్‌లేషన్ చేయించి సులభంగా పిల్లల అభివృద్ధికితెస్తే మంచిది. అట్లా చేయగలము. వేరుకాదు. లక్షలు ఈ విషయములో ఖర్చుపెట్టినా పర్వాలేదు. ఎందుకంటే మనజాతి యావత్తు టెకినికల్‌లో పారిశ్రామికములో అభివృద్ధి కావలయును. ఏదో యింగ్లీషులో శాస్త్రవిజ్ఞానమువుంది, గనుక యిది సాధ్యముకాదనే సాకును ముందుపెట్టుకొని మన భాషను ముందుకు తీసుకరాని పక్షములో దేశమునకు ఎంతో నష్టముచేసినవార మగుదుము. అందుకు ఈ బిల్లులో స్పష్టముగా ఒక పేరా వ్రాసి మాతృభాషలోనే టెకినికల్ ఎడ్యుకేషన్, ఇంకా ఇతర ఎడ్యుకేషన్సు యిప్పించుటకు ప్రయత్నము చేస్తున్నామన్న విధముగా, స్పష్టముగా వ్రాయవలెను.

దానికొరకు రెండు సంవత్సరములు 3 సంవత్సరములు, సాధ్యముకాని పక్షములో క్రమముగానైన చేసితీరవలెననే ఒక క్లాజును పొందుపర్చవలెనని నేను గట్టిగా కోరుచున్నాను. లేకపోతే మనము దేశమునకు ఒకవిధముగా ద్రోహముచేసినవార మవుతాము. ఇప్పుడు అన్నిదేశములలో శాస్త్రజ్ఞానము యింగ్లీషులోవున్నదా? వారి మాతృభాషలోనే శాస్త్రవిజ్ఞానము పెంపొంది సంవత్సరాల తరబడి చదివి సైన్సునేర్చి అభివృద్ధిపొందిన దేశములు ఎన్నోలేవా? పశ్చిమదేశములున్నవి, తూర్పుదేశములున్నవి, ఈ దేశములు, ఈ వేళ శాస్త్రీయ రంగములో ఎంతో అభివృద్ధిపొంది ఉపగ్రహాలను ఎగరవేస్తున్నాయి. ఇది అంతా ఎట్లుజరుగుచున్నది? వీరు యింగ్లీషు భాషను లేక జర్మనీభాష నేర్చుకున్నారా? తమ మాతృభాషలోనే వైజ్ఞానమును క్రమముగా అభివృద్ధి చేసుకున్నారు. మన మాతృభాషలో, మనము వైజ్ఞానికముగా అభివృద్ధి గాంచవలయునంటే చాల కొద్దిటైమ్‌లో, కొద్ది ఎనర్జీతో చేసుకొనుటకు అవకాశములున్నవి. ఈలాటి అవకాశములు మన పిల్లలకు కలుగనీయకుండినట్లయితే అట్టి బాధ్యత మనమీద పడుతుంది.

కావున ఈ సంగతులన్నీగ్రహించి ఈ బిల్లులో ఒక అంశమును పెట్టుటకు సెలెక్టు కమిటీవారు పరిశీలించి జాగ్రత్తగా నిర్ణయించి చాల పట్టుదలతో దానిని చేర్చవలెనని కోరుచున్నాను. లేకపోతే ఇంగ్లీషును చదువలేక స్టాండర్డు పడి పోతుంది. ఈ పద్ధతి పెట్టినట్లయితే 30 వ సంవత్సరంలో చదువు ముగించుకొనే విద్యార్థి 14, 15 సంవత్సరములో ముగించుకుంటాడు. శాస్త్ర విజ్ఞానములో అభివృద్ధి చెందుతాడు. అందువలన దేశమును ముందుకు తీసుకొనిపోయే అవకాశము కూడ వున్నది. కనుక చాల శ్రద్ధతో ఏదో అట్టి ప్రొవిజన్ చేర్చ వలెనని కోరుచున్నాను.

శ్రీ డి. హనుమంతరావు : అధ్యక్షా, యూనివర్శిటీ బిల్లుకు సంబంధించిన సంస్కరణలను గురించి నిన్న, నేడు చాల తీవ్రంగా అనేక దృక్పథములతో గౌరవసభ్యులు అభిప్రాయములను తెలిపినారు. ఉస్మానియా యూనివర్సిటీకి సంబంధించినంతవరకు ఏ పరిస్థితులలో ఈ బిల్లు ఈ విధముగా సవరణ చేయుటకు తీసుకునిరాబడినదో దానిని ఒకసారి మన దృష్టిలోనికి తీసుకునివచ్చినట్లయితే ఈ బిల్లు ఆ పరిస్థితులకు ఏ విధముగాను అనుగుణ్యముగా లేకుండా పరిస్థితులను చాలా కల్మషంగాచేసినదో బోధపడుతుంది. తెలంగాణలో ఎక్కడైతే ఉస్మానియా యూనివర్సిటీ ఏర్పాటు చేయబడినదో దానికి గత 30 సంవత్సరాల చరిత్రవున్నదో ఆ చరిత్రకు ఆ సంప్రదాయాలకు దానికి సంబంధించిన ఆశయాలకు భిన్నమైన పరిస్థితులు ఈ బిల్లులో కలిగించుచున్నదని చెప్పి మనమందరము

అనుమానము పడకతప్పదు. కావున ఏ పరిస్థితులలో ఈ సవరణకు ప్రభుత్వము సంకల్పించినదో, ఒక కమిటీని ఏర్పాటుచేసి వారి రెకమెండేషన్స్ ప్రకారముగా బిల్లును రూపొందించినట్లు ఈ బిల్లులో సూచించబడినదో ఆ కమిటి బహుశ యూనివర్శిటీకి సంబంధించిన వివరాలను సక్రమముగా ఆలోచించకుండా తాము చేయవలసిన పనిని ఏ విధముగా చేయగలుగుతామో అన్నది ముఖ్యముగా పెట్టుకొని ఈ రెకమెండేషన్స్ యిచ్చినట్లు బోధపడుచున్నది. ఉస్మానియా యూనివర్శిటీ ఛార్టరుతో ఇప్పుడు ప్రవేశపెట్టిన ఈబిల్లును పోల్చి చూస్తే అనేకవిధాల యిదివరకు వున్న ఛార్టరే చాల బాగుగా వుండెను. చాల ఉపయోగకరముగా వుండెనని చెప్పుటకు తప్పదని మనకు బోధపడుతున్నది. ఇందులో ముఖ్యముగా వైస్ ఛాన్సలరు గురించి ఏ పద్ధతి సూచింపబడినదో. యిదివరకున్న పద్ధతికీ యిప్పుడు ఉన్న పద్ధతికీ ఆలోచించితే ఏమీ తేడావున్నట్లు కన్పించడములేదు. దానినిసూక్ష్మంగా ఆలోచించితే యిదివరకు వైస్ ఛాన్సలరు ఏ విధముగా అపాయింట్ చేయబడుచున్నారో అదే పద్ధతి చాలమంచిగా ఉండేది గాని దాన్ని అనవసరముగా సెనేటు పరము చేసినారు.

శ్రీ ఎస్. బి. పి. పట్టాభిరామారావు : వారు చెప్పినది నాకు అర్థంకాలేదు. ఇపుడు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఉన్న పద్ధతే బాగా ఉన్నదని వారు అంటున్నారా ?

శ్రీ డి. హనుమంతరావు : ఏమీ తేడాలేదని మనవి చేస్తున్నాను. ఈ సవరణకు పూర్వం వైస్-ఛాన్సెలరును నియమించే పద్ధతి ఉన్నపుడు విశ్వవిద్యాలయ పరిపాలన ఎంత efficient గా జరిగినదో చరిత్రనుబట్టి చూస్తే, ఇపుడు తీసుకువచ్చిన బిల్లువలన పరిస్థితి బాగుకాదని పూర్వపు పరిస్థితియే బాగా ఉన్నదని చెప్పవలసి యున్నది. అప్పట్లో ప్రభుత్వం ప్రత్యక్షంగా (direct) బాధ్యత వహించి వైస్‌ఛాన్సలరును నియమించేది. తన చర్యకు సంపూర్ణ బాధ్యత వహించేది. ఇపుడు బిల్లులో చెప్పబడిన పద్ధతిలో, సెనేటుకు సభ్యులు వచ్చిన తరువాత వైస్-ఛాన్సలరును ఎన్నుకొనుటకు వీలుండదు. సిండికేటు ఇద్దరి సభ్యులతోను ఛాన్సెలరు నామినేటు చేసిన మరొక సభ్యుని తోను ఒక కమిటీగా ఏర్పడి ఆ కమిటీవారు మూడు పేర్లతో ఒక panel ను తయారు చేస్తే అందులో నుండి ఛాన్సెలరు, వైస్-ఛాన్సెలరును నామినేటు

చేస్తాడు. దీనికన్న ప్రత్యక్షంగా చాన్సెలరు వైస్-ఛాన్సెలరును నియమించే పద్ధతి బాగుంటుంది. ఈ క్రొత్త పద్ధతిలో ప్రజాస్వామ్యం అన్నదిలేదు; ప్రత్యక్ష బాధ్యత అన్నది లేదు. ఇట్టి పద్ధతిని ఎందుకు అవలంబించారో అర్థంకావడంలేదు. సెనేటు, సిండికేటు, ఎకాడమిక్ కౌన్సిల్- వీటి వివరాలన్నీ పరిశీలించి చూస్తే, గౌరవసభ్యులొకరు చెప్పినట్లు ప్రతి అడుగున ప్రతిచోట mistrust, అపోహ, అవిశ్వాసం ప్రకటించడం జరిగింది. ఇది ఎందుకు జరిగినదో ఆలోచిస్తే ఈ బిల్లు రాకపూర్వం జరిగిన సంఘటనలు కండ్ల ఎదుటకు వస్తాయి. దానిని కప్పిపుచ్చ డానికి పరోక్ష పద్ధతి (indirect way) ని అనుసరించి మూడింట రెండు వంతులు వరకు నామినేషన్లు పెట్టడం జరిగింది. ఈ పద్ధతి democratic set up లో విశ్వ విద్యాలయం అభివృద్ధిచెందడానికి ఏ విధంగా దోహదకారి అవుతుందో అర్థం కావడంలేదు. నామినేషన్లను అధిక భాగంగా ఉంచడం వల్ల మంచి personnel వస్తారని అనవచ్చును. కాని నేటి పరిస్థితులలో political executive ఏవిధంగా influence చేస్తున్నదో corrupt పద్ధతులను అనుసరించి అప్రతిష్ఠ తెచ్చుకుంటు న్నదో గమనించిన తరువాత విశ్వవిద్యాలయ వ్యవహారాలలో కూడా political executive influence అధికమగుటచేత మంచి personnel వస్తుందని అనుకోవ డానికి వీలులేదు. అట్టి అభిప్రాయమే ఉన్నట్లయితే అది అపోహకాగలదు. ఈ విశ్వ విద్యాలయ చట్టాన్ని ఏర్పాటుచేసిన తరువాత modern thought కు అనుకూలంగా విశ్వవిద్యాలయాన్ని చక్కబరచి, అభివృద్ధిచేసుకుంటామని ఆశించటం పొరపాటుకాగలదు. ఈకారణంచేత నామినేషన్లువల్ల విశ్వవిద్యాలయ అభివృద్ధికి ప్రమాదం కలుగుతుంది విశ్వవిద్యాలయంలో రాజకీయ ప్రభావం అధికమై అనేక తగాదాలకు తంటాలకు కారణం అవుతుంది. విశ్వవిద్యా లయాన్ని ప్రభుత్వంయొక్క ఒక Glorified Department గా భావించినపుడు అనేకరకాలైన nepotism, corruption పద్ధతులు వచ్చేఅవకాశం కలుగుతుంది. ఈ బిల్లు సెలక్టుకమిటీకి వెళ్ళుతున్నప్పటికీ, మేము చెప్పినవిషయాలకు అను కూలంగా సెలక్టుకమిటీలో సవరణలు జరుగుతాయనే ఆశ మాకులేదు. ఈ బిల్లును ప్రజాభిప్రాయం కొరకు ప్రచురణచేశారు. ఆంధ్ర, తిరుపతి, ఉస్మానియా విశ్వ విద్యాలయాలవారు తమతమ అభిప్రాయాలను తెలియచేశారు. ఆ అభిప్రా యాలను కప్పిపుచ్చి వాటిని దృష్టిలో పెట్టుకోకుండా ఈబిల్లు ఈస్వరూపంలో తీసుకువచ్చారు. ప్రజాస్వామ్యవ్యవస్థలో ప్రజాభిప్రాయం వర్ధిల్లాలని బలవత్తరం కావాలని అంటున్నాము. కాని దానికి భిన్నంగా వ్యతిరేకంగా ఈబిల్లును తీసుకువచ్చి మెజార్టీ పేరుతో క్రమశిక్షణ పేరుతో pass చేయించుకునేస్థితి వచ్చింది. దీనివల్ల ప్రజాభిప్రాయం బలవత్తరం; ప్రజాస్వామ్యం వర్ధిల్లజాలదు,

ఈ పరిస్థితులలో ఎవరో కొందరు బాగుపడవచ్చును. కాని ప్రజాస్వామ్య సాంప్రదాయాలు దోహదం కావు. అసలు ప్రజాస్వామ్య వ్యవస్థకే హాని కలుగుతుందని మనవిచేస్తున్నాను. సెలక్టుకమిటీ ఈబిల్లును section by section విచారించి ప్రజాభిప్రాయానికి అనుగుణంగా ప్రజాస్వామిక సాంప్రదాయాలకు అనుగుణంగా విశ్వవిద్యాలయ అభివృద్ధికి వీలుగా సవరణలు, మార్పులు చేయాలని తమద్వారా మనవిచేస్తున్నాను. ప్రజాస్వామిక సాంప్రదాయాలను స్థిరపరచే ప్రయత్నం చేయకపోయినట్లయితే దేశంలో totalitarian శక్తులు, dictatorial శక్తులు బలపడే ప్రమాదం ఉన్నది. ఈ విషయాన్ని గుర్తించక తప్పదు. ఈనాటి విధానాలు కొంతమందికి, ఒక గ్రూపునకు లాభసాటిగా ఉండవచ్చును. కాని authoritarian పద్ధతులను వ్యతిరేకించి ప్రజాస్వామ్య సూత్రాలపై దేశాన్నినడపి అభివృద్ధిపరచాలనే కంకణం కట్టుకున్న వారమైనపుడు ఇటువంటి బిల్లును సమగ్రంగా సవరించవలసి ఉంటుంది. ఈ విషయమును గుర్తించకుండా, నేడు మెజార్టీ ఉన్నది కదా అనే అభిప్రాయంతో ఏమైనా తీర్మానాలు చేసినట్లయితే, ఆ తీర్మానాలకు శాసనసభ ముద్రవేసినట్టయితే, ఈ శాసనసభ అస్తిత్వానికే భంగంకలుగవచ్చునని తమద్వారా మనవిచేసుకుంటూ సెలవుతీసుకుంటున్నాను.

శ్రీ గోపిడి గంగారెడ్డి : అధ్యక్షా, ఏ విశ్వవిద్యాలయాల బిల్లు అయితే చర్చలో ఉన్నదో —

శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మ : On a point of order, Sir గౌరవ సభ్యులు తమ సీటులో లేరు ; అక్కడనుంచి మాట్లాడవచ్చునా ?

శ్రీ గోపిడి గంగారెడ్డి : Panel of Chairmen లో ఉన్న సభ్యురాలికే రూల్సు తెలియకపోవడం ఆశ్చర్యం. ఇప్పుడు చర్చలో ఉన్న విశ్వవిద్యాలయ బిల్లుతో ప్రజాస్వామ్యం అనే పాలు, పెరుగునకు పిల్లిపోరు తగిలింది అన్నమాట. చివరకు ప్రజాస్వామ్యానికి పాడి, పెరుగు ఏమైనా మిగులుతుందో, పిల్లి యే నాక్కుపోతుందో ! వెనుక వైస్-ఛాన్సలరు నియామక సందర్భంలో విద్యార్థులు అలజడి, అల్లకల్లోలం జరిపారు. అప్పుడు విద్యార్థులు శాసనసభ ముందుకు వస్తే, పాపం, మంత్రులు ఎదుటనుంచి పోజాలక వెనుకనుంచి వెళ్ళిపోయారు.

[*Sri P. Narasinga Rao in the Chair*]

కాని వెళ్ళిపోయి యేమి చేశారు ? శ్రీ రంగారెడ్డిగారితో నాకు పది సంవత్సరాలనుంచి పరిచయం ఉంది. మేము కాంగ్రెసులో కలిసి పనిచేశాము.

తరువాత కాంగ్రెసునుంచి విడుదలయి యువతలకు వచ్చాను కాని ఎన్నడూ ఆయన యీ నాడు మాట్లాడినంత అబద్ధం మాట్లాడలేదు.

*Smt. C. Ammanna Raja:* Mr. Speaker, Sir. Is it parliamentary to say, "అబద్ధం మాట్లాడారు?"

మిస్టర్ స్పీకర్ : అబద్ధం అనే శబ్దములో Unparliamentary ఏమీలేదు.

శ్రీ గోపిడి గంగారెడ్డి : పోనీండి, నిబద్ధికి తక్కువగా ఉంది. వారు పోలీసు శాఖకు చెందిన మంత్రి అవడంవల్ల సహవాస దోషం ఆయనకు కలిగిందేమో? వైస్ చాన్సలరు నామినేషను కొరకు తిరుపతి వేంకటేశ్వర యూనివర్సిటీకి మాత్రమే బిల్లు తీసుకు రమ్మని ఆ విద్యార్థులు పోరాడినారా? చిన్నపిల్లలను వేలుకుమక్క పెట్టి, "కుడివేలు మీద చుక్కకావాలా ఎడమవేలుమీద చుక్కకావాలా" అని వేళ్లు మార్చి ఆడించినట్లు శ్రీ రంగారెడ్డిగారు మమ్ములను చిన్నపిల్లలనుకున్నారా? వైస్ ఛాన్సలర్ ఎన్నికలు కావాలని విద్యార్థులు అడిగినప్పుడు వారికి హామీ యిచ్చినారు. ఆంధ్ర యూనివర్సిటీలో ఉండే మాదిరిగా తిరుపతి యూనివర్సిటీలో ఉండే మాదిరిగా తీసుకవస్తామన్నారు. నాకు ఒక కథ జ్ఞాపకం వస్తున్నది. ఒక పిల్ల పెళ్ళికావాలని ఏడిచినదట, ఇంటిప్రక్కనున్న ఆమెతీరుగా పెళ్ళిచేస్తానన్నాడట ఆమె తండ్రి. కాని అప్పుడే యింటిప్రక్కనున్న ఆమె విధవ అయిపోయింది; అందుచేత 'ఇంటిప్రక్కనున్న ఆమెవలె నీవుకూడ విధవతీరుగ ఉండ'మని చెప్పినాడట. ఆ మాదిరిగా వున్నదీ బిల్లు. ఉస్మానియా యూనివర్సిటీలో వైస్ ఛాన్సలర్ ఎన్నిక కావాలని కోరితే మిగతా రెండు యూనివర్సిటీలకు ఎన్నిక పద్ధతి తీసేసి మొత్తం మూడింటికీ ఎన్నికలేని బిల్లులను తీసుకువచ్చారు. ఒక గౌరవసభ్యురాలు పిల్లకాయలకు దీనిలో ప్రాతినిధ్యం యివ్వడంవల్ల నష్టం వుందన్నారు. మేము ఓనమాలు రాని పిల్లవారికి ప్రాతినిధ్యం యివ్వమంటున్నామా? శ్రీ చెన్నారెడ్డిగారు చెప్పినట్లు గురువుతో సమానమైన తెలివితేటలు జ్ఞానంకలిగివున్న శిష్యులుంటారు. వారికి ప్రాతినిధ్యం యివ్వమనడం దోషమా? ఇప్పుడు సత్యాన్ని అసత్యమనీ అసత్యాన్ని సత్యమనీ చమత్కారంగా చెప్పడం ఒక కళ అయిపోయింది. అట్టి కళను అభ్యసించడంవల్ల దేశం ఏ దిశకు పోతుందో తెలియదు. తమకు తోచినవారిని రేపు ఎన్నికలలో మద్దతు చేసేవారుండే విధంగా చేసిన ఉపాయం యీ బిల్లు. శ్రీ రంగారెడ్డిగారు తమ వాక్కులను మ్రింగుకున్నారు. ఆనాడు విద్యార్థులు చేసిన గొడవ వారికి వినబడ్డదో లేదో? అంతగడబిడకు కారణమైన శాసనసభ్యులను తీసుకుపోయి ఖైదులో పడేయాలని ఒక గౌరవసభ్యురాలు చెప్పారు.

శ్రీమతి వై. సీతాకుమారి. అధ్యక్షా, అసెంబ్లీ సభ్యులని చెప్పలేదు. ఆ ఉద్యమానికి వెనుకవున్న రాజకీయ నాయకులని మాత్రమే చెప్పాను.

శ్రీ గోపిడి గంగారెడ్డి: ఇక్కడ ఉన్న మేము అరాజకీయ నాయకులమా ?

శ్రీమతి వై. సీతాకుమారి: రాజకీయ పోరాటం వెనుకనున్న రాజకీయ నాయకులన్నాను.

మిస్టర్ ఛైర్మన్: వారు తమ అభిప్రాయాన్ని తెలిపినారు. మీ రిచ్చిన ఉపన్యాసం వారు అర్థంచేసుకున్న విధముగా చెప్పారు.

శ్రీమతి వై. సీతాకుమారి: నేను చెప్పని మాటలు చెప్పానంటే ఊరుకోమంటారా ?

మిస్టర్ ఛైర్మన్: మీరు చెప్పిన దానిని వారు ఆ విధముగా అర్థం చేసుకున్నారు.

శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మ: సరిగా అర్థంచేసుకోవాలని చెప్పండి.

శ్రీ గోపిడి గంగారెడ్డి: సరిగా అర్థం చేసుకోడానికి మనందరము పాఠశాలలకు పోవాలి. మనస్సులో ఎంత వుందో దానిని వాక్కులో చెప్పడం సత్యం అవుతుంది. ఈనాడు గాంధీజీ సిద్ధాంతాలు వినోబాభావే సిద్ధాంతాలు చెబుతున్నారు. సాహుకారు పూజ చేసినప్పుడే సత్యం పలికి దుకాణంలో అంకర కొట్టినా, టింకర కొట్టినా నాకే జయం అన్నట్లు ప్రజాస్వామికంలో ఎన్నికలుండాలని చెబుతూనే దానిని తొలగించి నామినేషను పద్ధతి పెడుతున్నారు. వైస్-చాన్సలర్ ఎన్నికకు విద్యావిహీనుని నిలబెట్టరు. అన్ని విధాల యోగ్యత గల వారినే నిలబెడతారు. ఇక్కడ మేధావులుండరని కాబోలు పెద్దల సభ ఒకటి ఏర్పాటుచేశారు. అక్కడ తీసుకురాబడిన వారెంత మేధావులో, అదెంత నీతియో, అదేమి రాజకీయమో తెలుస్తూనే వుంది. తెలంగాణాకు ఒక **Regional Committee** వుంది. ఈ బిల్లును **Regional Committee** కి పంపకుండా శాసనసభకు తీసుకురావడం ఉచితం కాదని తమద్వారా మనవిచేస్తూ ముగిస్తున్నాను.

శ్రీ పి. గోపాలురెడ్డి (తిరుత్తని - జనరల్): అధ్యక్షా, గౌరవ విద్యాశాఖ మంత్రిగారు యీ మూడు విశ్వవిద్యాలయాలకు సంబంధించి తెచ్చిన బిల్లులను నేను సమర్థిస్తున్నాను. మనం ముందుకు పోతున్నప్పుడు ఎప్పటికైనా

యిటువంటి మార్పులు తప్పక జరుగవలసి వుంటుంది. ఆ విషయాన్ని మాత్రం మన తోటి సభ్యులు మరచిపోతున్నారని నా అభిప్రాయం. ఒకనాడు ఒక వాగ్దానం చేసివుండవచ్చు. పరిస్థితులు మారివుండవచ్చు. ఈనాటి పరిస్థితుల ననుసరించి మనం చేస్తున్న పనులలో సక్రమమైన విధానాన్ని అనుసరిస్తున్నామా లేదా అని గ్రహించుకోవలసి వుంటుంది. ఆ పద్ధతిగా చూస్తే యిదివరలో పెద్దలు చేసిన వాగ్దానాలు నెరవేరినవా లేవా అనే అనుమానాలకు ఆస్పదం వుండదు. శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో గాని ఆంధ్రవిశ్వవిద్యాలయంలో గాని ఒక స్థాయిలో కార్యక్రమం జరుగుతూ వుండిన విషయం మనకు తెలిసినదే. ఉస్మానియా యూనివర్సిటీ ఆంధ్రప్రదేశ్ అవతరణ తరువాత మన ఆదరణలోకి వచ్చినది. ఇక్కడ ఉన్న విధానానికి ఇదివరలో ఆంధ్ర రాష్ట్రంలో ఉండిన విశ్వవిద్యాలయాలకు కొద్ది తేడాలు ఉన్నవి. ఇవన్నీ సమగ్రపరచి ఒకేస్థాయిలో నడిచేపద్ధతిని అనుసరిస్తున్నందుకు, ఆవిధంగా ఈ బిల్సును తయారు చేసి ప్రవేశ పెట్టినందుకు మంత్రిగారిని అభినందించవలసి యుంటుంది. ఒకచోట ఒక విధానము మరొక చోట మరొక విధానం, ప్రభుత్వ కార్యక్రమంలో జరిగితే చాలా యిబ్బందిగా ఉంటున్నది. ఆ పరిస్థితులు లేకుండా చేయుటకు యీనాడు ప్రభుత్వం తలపెట్టిన యీ మూడు విశ్వవిద్యాలయముల బిల్సు చాలా సమర్ధనీయంగా ఉన్నవని నేను మరొకమారు ప్రభుత్వాన్ని అభినందించవలసి యుంటుంది. అయితే ఈ సవరణలలో కొన్ని ఇబ్బందులు ఉన్నవని కొందరు గౌరవ సభ్యులు చెప్పినదానిలో కొంత వాస్తవం ఉండవచ్చునేమో. కాని ఈనాడు ఈ బిల్సును కేవలం చట్టరూపముగా చేయుటలేదు. సెలెక్టు కమిటీకి పంపబడుచున్నది. ఆ సెలక్టుకమిటీలోకి, విద్యావిషయములందు అధిక శ్రద్ధ కలిగిన వ్యక్తులను మంత్రివర్యులు తీసుకొనవచ్చును, అక్కడ అన్నివిషయాలు, సదుపాయాలు సమగ్రంగా ఆలోచించి ఈనాటి పరిస్థితులలో ఏవిధంగా ఉంటే బాగుంటుందో ఆలోచించి సవరణలు ప్రతిపాదించవచ్చును. సెలెక్టు కమిటీ వారి పరిశీలన పూర్తి అయి ఈ సభాను ముందుకువచ్చిన తరువాత మనము **clause by clause** చర్చించేటప్పుడు యింకా ఏమైనా యిబ్బందులు ఉంటే సవరణలద్వారా తొలగించే అవకాశం ఉంటుంది.

తరువాత ఈ విశ్వ విద్యాలయాలలో కేవలం ఎకడమిక్ పార్టీ అధికంగా వ్యవహరించడం ఉచితంగా లేదని నా స్వంత అభిప్రాయం. ఎందువల్లనంటే విద్యనేర్చుకొనే స్థానములోఅనేక ప్రాంతాలనుంచి వచ్చినవిద్యార్థులు ఉంటారు. వారియొక్క అన్ని సౌకర్యాలు విశ్వవిద్యాలయం చూడవలసియుంటుంది. మ్యునిసిపాలిటీలనుంచి, పంచాయతీ బోర్డులనుంచి రిప్రజెంటేషన్ ఎందుకని,

వారు ఏమి సలహాలు యివ్వగలరని, తోటి సభ్యులు చెప్పగా విన్నాను. అది చాలా విచారకరమైన విషయం వారికి ఆ బాధ్యత లేదనే అభిప్రాయం అనుమానాస్పదమైనది. తప్పకుండా వారికికూడ కొంత బాధ్యత ఉన్నది, ఈనాడు మన రాజ్యాంగంలో ఓటు చేయగలిగిన ప్రతివ్యక్తి, మహోన్నతమైన భారతదేశపు ప్రెసిడెంటు పదవిని అనుభవించగలిగిన అవకాశం ఉన్నప్పుడు మ్యునిసిపల్ కౌన్సిలు, పంచాయితీబోర్డుల సభ్యులు యూనివర్సిటి సెనేట్సులో ఉండి సలహాలు యివ్వలేరనే అనుమానాలు ఉండటం శోచనీయం. రూరల్ ఏరియాస్‌లో ఉండే ప్రజల ప్రతినిధులను కూడా తీసుకుని వారి సలహాలను కూడ పొందగలిగితే అందరి క్షేమానికి అనుకూలంగా ఉంటుందని భావించ వలసియుంటుంది. కాబట్టి మ్యునిసిపాలిటీలకు ప్రాతినిధ్యం యివ్వకూడదనే అభిప్రాయాన్ని విరమించుకోవాలని అభిప్రాయ పడుతున్నాను, విద్యార్థులకు కూడా అందులో ప్రాతినిధ్యం కావాలన్నారు. ఉత్సాహపరులుగాఉండిస్టూడెంటు ఉద్యమాలనునడిపే వ్యక్తులకు ఇటువంటి అభిప్రాయం ఉండటం పొరపాటు కాదు. వారి ఉత్సాహములో. స్టూడెంట్సుకూడా అందులో ఉంటే బాగుంటుందని అనుకొని ఉండవచ్చును. కాని స్టూడెంట్సు తమయొక్క అభివృద్ధికి పాటుపడే అవకాశాలు అనేకం ఉన్నవి. కేవలం సెనేటులోగాని, సిండికేటులోగాని, ఎకడమిక్ కౌన్సిలులోగాని స్టూడెంట్సును ఉంచినంతమాత్రన, వారికి ఒకవిధమైన ఆదరణ చూపినట్లుగా మనము అనుకోవలసినది లేదు. వారి అభివృద్ధికోసం వారికి మాతాపితలైనవారు, వారిశ్రేయస్సును కోరగలిగినవారు విశ్వవిద్యాలయ యాజమాన్య ఆధ్వర్యంలో ఉండి కృషిచేస్తూ ఉంటారు కాబట్టి వారి క్షేమానికి ఎట్టిలోపము ఉండదు. ఈ విద్యాసంస్థలలో రాజకీయంగా ఎటువంటి జోక్యము ఉండకూడదని చెబుతున్నారు. ఇందులో రాజకీయజోక్యము ఎలా వస్తుందో తెలియుటలేదు. వైస్‌ఛాన్సెలర్ యొక్క అప్పాయింట్‌మెంట్ ఛాన్సెలరే చేస్తాడని, ఛాన్సెలర్ చేయడమంటే ప్రభుత్వము చెప్పినవారినే చేస్తారని కొంతమందికి అనుమానం ఉన్నట్లు చెప్పారు. అటువంటిదేమీ లేదు. వైస్‌ఛాన్సెలరు పదవికి మూడు పేర్లు వచ్చినతరువాత, ఛాన్సెలరుగా ఉండే వారు, ఆ ముగ్గురిలో ఎవరినైనా ఒకరిని అప్పాయింట్ చేస్తారు. ఆ మూడు పేర్లలో సరైనవారు లేరని తోస్తే, ఆ లిస్టు తిప్పి పంపి, వేరేపేర్లు పంపమని కోరవచ్చును. అంత అధికారము ఛాన్సెలరుకు ఉన్నది. కేవలం గవర్నరుగా పెట్టుకొన్న వ్యక్తిని సందేహిస్తే, వారుకూడ ఒక రాజకీయపక్షానికి చెందిన వారుగా అనుకుంటే అందుకు అడ్డేలేదు, అంతేలేదు. అందువల్ల అటువంటి అనుమానాలు లేకుండా ఈ బిల్లును అందరూ సమర్థించవలసి యుంటుంది. మన

మూడు విశ్వవిద్యాలయాల విధానమును సమన్వయపరచి ఒకే విధమైన సిద్ధాంతాన్ని రూపొందించి నడుచుకుంటే, మన పిల్లలకు ఉత్తరోత్తర అభివృద్ధి ఉంటుందని భావించవలసి యుంటుంది. టెక్నికల్ కాలేజెస్‌లో ఒక చోట ఒక విధానము, మరొకచోట మరొక విధానము ఉండటంవల్ల మన బిడ్డలకు సెలెక్షన్సులో మనము పడే ఇబ్బందులు అందరికీ తెలుసు. అన్నింటిలో ఒకే విధానం ఉన్నట్లయితే యీ యిబ్బందులన్నీ తీరిపోతాయి. ఈ మూడు విశ్వవిద్యాలయములలోను ఒకే రకమైన నిబంధనలు ఉంటే ఎటువంటి కష్టము అనుభవించవలసిన అవసరం ఉండదని అభిప్రాయ పడుతున్నాను. ఈ కాంపోజిషన్‌లో నామినేటెట్ మెంబర్సు అధికంగా ఉన్నారని చెబుతున్నారు. నామినేషన్సు ఎందుకు పెట్టారంటే — మంచివ్యక్తులు ఉండి ఎలెక్షన్సులో రాలేని పరిస్థితులు ఉండవచ్చు. అంతేకాక, వెనుకపడ్డ జాతుల వారుగాని, un-represented communities గాని, associations గాని ఉంటే అటువంటివారికి అవకాశాలు యివ్వడానికి ఈ నామినేషన్సు పెట్టారు. దూర దృష్టితో ఆలోచిస్తే ఈ ఉద్దేశం మంచిదని భావించవలసియుంటుంది. ఇంకొక విషయం రు. 10,000 లు చందా యిచ్చినవారికి ఒక మెంబరును నామినేట్ చేయడానికి అధికారం యిచ్చారు. ఆ పద్ధతి పెట్టితే, ఒకరికి రు. 30 వేల బంగళా ఉండి, దానిని అమ్మి 10 మంది మెంబర్సును నామినేట్‌చేయవచ్చును అనే విధంగా కొందరు చెప్పారు. ఆ విధంగా ఎవరూ రారు. అలాంటి ధనికులు ఉంటే, యింకా నాలుగు యూనివర్శిటీలను మనము స్థాపించుకొనే అవకాశం ఉంటుంది. ధనం పోగుచేయడమంటే ఆ కష్టము వైస్‌చాన్సెలర్‌కే తెలుసు, అక్కడ యాజమాన్యం చేసే Academic Council వారికే తెలుసు. కేవలం విద్యాసంస్థలకు దానధర్మాలు చేసేవారు నూటికి ఒకరో, వెయ్యికి ఒకరో ధర్మాత్ములుఉంటారు. వారిధర్మముతోనే ఇటువంటి విద్యాసంస్థలు నెరవేరుతూ వస్తున్నాయి. ఆంధ్ర యూనివర్శిటీని start చేసినప్పుడు ధనము కావలసియుండి అప్పుడు వైస్‌చాన్సెలర్సుగా ఉండిన రాధాకృష్ణన్, రామలింగారెడ్డిగార్ల కృషితో నిలువగలిగి, యీనాటికి యింత శక్తివంతంగా తయారైనది. కాబట్టి యీ విషయాలన్ని ఈ సందర్భంలో ఆలోచించి, అనుమానాలు పెట్టుకోకుండా యీ బిల్సును పరిశీలించాలని కోరుతూ, నాకు యీ అవకాశం యిచ్చినందుకు అధ్యక్షులవారిని అభినందిస్తున్నాను.

శ్రీ పి. కోదండరామయ్య (పోలవరం) : అధ్యక్షా, యీ బిల్లును నేను బలపరుస్తున్నాను. అయితే యీ విషయంలో నాకు ఎక్కువ పరిచయము

లేదు. నేను విద్యావేత్తను కాను. ఆర్గ్యుమెంట్స్ చెప్పటానికి, నేను లాయర్‌ను కూడా కాదు. పోనీ దీర్ఘంగా think చేసి చెప్పటానికి నాకు మేధాశక్తి లేదు.

కొందరు గౌరవసభ్యులు "ఈ బిల్లు ప్రజాస్వామ్యమునకు చాలా దూరంగా ఉంది" అని అన్నారు. ప్రజాస్వామ్యము ప్రకారముగా ఈ ఎసంబ్లీని ఏర్పాటు చేశారు. ఈ అసెంబ్లీయొక్క ఆమోదముతోనే ఒక మంత్రివర్గము ఏర్పాటయినది. ఆ ప్రభుత్వము ఒక బిల్లు తయారుచేసి ఇక్కడ పెట్టింది. ఈ పార్టీయే, ఈ బిల్లుయే శాశ్వతంగా ఎప్పుడూ ఉంటుందని ఎలా ఊహిస్తున్నారో నాకు గోచరం కాలేదు. నిన్న గోపాలరావు ఎక్బోటేగారి ఉపన్యాసము విన్నాను. వారి ఇంగ్లీషు ఉపన్యాసము వినటముకోసం నేను కూర్చున్నాను. ఆయన చాలా, powerful గా మాట్లాడారు. అలాంటి మంచి powerful speaker యొక్క ఉపన్యాసము వినటం నాకు ఇష్టము. అయితే ఇంగ్లీషుభాష అంత అర్థం చేసుకోలేనుగాని, ఒక స్తోత్రం విన్నట్లుగా, విని, చెవులకు ఒక విధమైన ఆనందం పొందటంకోసము, శ్రద్ధగా కూర్చుని వారి ఉపన్యాసము విన్నాను. వారు విశేషమైన మేధాశక్తికలవారు. వారు గొప్ప లాయరు. వారు బాగా సమర్థతతో చెప్పగలిగినవారని నాకు తోస్తున్నది. కేవలం ప్లీడరీ విషయంలోనే కాకుండా, పార్టీ విషయంలోనే కాకుండా, ప్రపంచంలో ఉండే సంగతులలో, ముందు జనరేషన్‌కు, భవిష్యత్తుకు మనమే ఒక మార్గాన్ని సూచించటానికి ఆలోచించటం ఎంత భావ్యమో చూడాలి. ఇదే ప్రభుత్వం ఎప్పుడూ ఉంటుందని మనం చెప్పటానికి సావకాశం లేదు. రేపు ఎన్నికల తర్వాత ఇది మారవచ్చు. లేదా ఈ లోపలే, ఆ మధ్య మారినట్లుగా అమాంతంగా మారితే మారవచ్చును. ఈ ప్రభుత్వం చెప్పినటువంటి సలహా ప్రకారం ఛాన్సలరుగారే ఈ నామినేటెడ్ పర్సన్స్‌నువేసి ఇదంతా నడుపుతారని చెప్పడంలో ఎంతదూరదృష్టి ఉంటుందో ఎంత ఆలోచనగా అంటున్నామో గ్రహించాలి. ఎప్పుడూ ఈ ప్రభుత్వమే ఉంటుందని నమ్మకం లేదు. అసలు నేను ప్రస్తుత యూనివర్సిటీ విధానాన్ని ఒప్పుకొనేవాడిని కాదు. నలందా, తక్షశిల విశ్వవిద్యాలయాల్లాంటివి కావాలని కోరేవాడను నేను. కాని అవి ప్రస్తుతం కలలో చూడాలేకాని ఇప్పుడు వచ్చేవి కావని నాకు తెలుసు. అయినా అలాంటి విశ్వవిద్యాలయాలు, అలాంటి విద్యావిధానం మళ్ళీ రావాలని కోరేవాడను నేను, ఇప్పుడున్నటువంటి విశ్వవిద్యాలయాలయందు నాకు నమ్మకమే లేదు. ఫ్యాక్టరీలలో తయారుచేసే వస్తువుల మాదిరిగా విశ్వవిద్యాలయాల్లో విద్య నేర్చుకునే మనుష్యులు ఉంటారు. ఈ దేశంలో మానవులను విజ్ఞానంలోనికి

తీసుకుపోవడానికి బదులు అజ్ఞానంలోనికి తీసుకుపోయే పంథాలో ఈ విశ్వవిద్యాలయాలు ఏర్పడినవి కనుక నేనువాటిని ఏమాత్రమూ సమర్థించను. ఈ విశ్వవిద్యాలయాలంటే నాకు ఏమీఇష్టంలేదు. ప్రస్తుతం ఉన్నటువంటి విద్యావిధానం అంటే నాకు ఇష్టము లేదు. గాంధిగారు చెప్పినటువంటి విద్యావిధానముండాలి. మన సంస్కృతి అభివృద్ధి అయే విద్య కావాలి. అసలు నేను దూదేకుల సంఘంలోని వాడిని. "దూది ఏకుట దారం వడుకుట" ఇదేదృష్టి కాని అట్టే పెద్దపెద్ద విషయాలు చెప్పగలిగిన అనుభవం లేదు. ఇందాక లక్ష్మణదాసుగారు చెప్పారు. మళ్ళీ నేను చర్విత చర్వణంగా అవేవిషయాలు చెప్పటం సమంజసంగాదు. నాకు ఒకమాట జ్ఞాపకం వస్తున్నది. మునుపు జిన్నాగారు "Islam in danger" అన్నట్లుగా "Talengana in danger" అనే slogan తో చెప్పటం చాలా విచారంగా ఉన్నది అని నేను గద్గదస్వరంతో చెప్పవలసి వస్తున్నది. కళ్ళంబడి నీళ్ళుకూడా వస్తున్నాయి. ఏమిరా! మనకు యింత దుర్గతి పట్టింది. ఆంధ్ర రాష్ట్రం కావాలన్నాం. గోపాల కృష్ణయ్యగారూ మేము చిన్నతనాన్నుంచి ఈ ఆంధ్రోద్యమంలో పాల్గొని ఆంధ్రరాష్ట్రంకోసం విశేషంగా పాటుపడ్డాం. మేము పాటుపడినా జరగనిది, పాపం, ఆ పొట్టి శ్రీరాములుగారు ప్రాణం పోగొట్టుకొన్న తర్వాత ఆంధ్రరాష్ట్రం రావటం జరిగింది. ఇందులో ఎవరి ప్రజ్ఞా లేదు. తర్వాత ఆంధ్రప్రదేశ్ వచ్చింది.

నాకు ఇరవై సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు నేను నాగపూరు **Conference** కు వెళ్ళుదామని వెళ్ళుతూ, మధ్యన సికింద్రాబాదు స్టేషనులో ప్లాటుఫారము మీదికి దిగాను. దిగగానే, నాచుట్టూ నలుగురు పోలీసువాళ్ళు ముట్టడించి, "నీవు ఎక్కడికి వెళ్లుతున్నావు ; నిలబడ"మన్ని అంటూ పేరు చెప్పమన్నారు. నాపేరు పుసులూరు కోదండరామయ్య అని చెప్పాను. వెంటనే ఈ నలుగురు నన్ను ఎక్కడికి కదలనివ్వకుండా చుట్టూ నిలబడ్డారు, నేను ఎక్కడికీ పోవడములేదు. "నేను ఏదో తినటానికి కొనుక్కుందామని బండిలో నుంచి దిగాను. నన్ను అడ్డుపెడతారెందుకు ?" అని అన్నాను. దానిమీదట "నీవు యిక్కడినుంచి కదలడానికి వీలులేదు. లేకపోతే బండిలోనికిపోయి కూర్చో" అని అన్నారు. అప్పుడు అది నైజాము ప్రభుత్వము ఉండగా యిది జరిగింది. అలాంటిది అనాటి నైజాము ప్రభుత్వముపోయి ఒకేసారి తెలుగు వాళ్ళు అందరు ఒకచోట చేరటానికి మనం యిప్పుడు ఆంధ్ర ప్రదేశ్‌ను ఏర్పాటుచేసుకున్నాము. అందుకు అందరము ఒకచోట చేరుకున్నందుకు సంతోషముగా ఉన్నది. అయితే ఎక్కువగా కోరేవారికి చులకనగా రాజ్యము వస్తూందంటే నాకేమీ అభ్యంతరములేదు. అయినను నాకు రాజ్యము అక్కర

లేదనుకోండి. ఇప్పటికే ఈ సభ్యత్వము నిర్వహించుకోటానికే నేను చాలా తంటాలు పడవలసివస్తున్నది. అందువల్ల యిప్పుడు ఈలోగా ఈ బిల్లును ఆస్కారముగ తీసుకుని తెలంగాణా ప్రజానీకానికి ఏదో అక్రమము, అన్యాయము జరగబోతున్నది అని చెప్పడము ఏమంత సబబుగాలేదు. అని నేను అనుకుంటున్నాను. అంటే ఈ బిల్లు ఇంగ్లీషు భాషలో ఉన్నది. ఇందులోని మాటలనుబట్టి నేను అట్లా అర్థము చేసుకోగలిగాను. నేను భాషను బాగా అర్థము చేసుకోగలిగినంత ప్రవీణత నాకు లేదుకాని నాకు అంతవరకే అర్థమైంది. అయినా ఈ బిల్లునుగురించి ఒకటే point వారు చెప్పారు. తరువాత Academic Council కు సంపూర్ణమైన అధికారము యిందులో లోపిస్తున్నది. దానికి సంపూర్ణమైన అధికారముయిస్తే బాగుంటుందని అంటున్నారు. నిజమే, తప్పకుండా యివ్వాలి. దానికి ఉండే అధికారము, అందులోని సభ్యులకు ఉండే అధికారము సంపూర్ణముగ దానికి ఇచ్చి, ఏర్పాటు చేయాలి. అయితే ఆ అధికారము ఏవిధముగ వస్తుంది? దానిని సభ్యులే ఎన్నుకుంటారు. అయితే అందులో నామినేటుచేయాలని అన్నారు. అందులో వేసిన సభ్యులు ఉన్నారుకదా. అప్పుడు ఆ విధముగ చేస్తే వస్తుందని అన్నారు. ప్రతివిషయం అనుమానిస్తే ఇక ఇది ముందుకుపోదు అని అనుకోవలసిఉంటుంది. ఐతే ప్రపంచంలో ఒక విషయం ఉన్నది. అధికారము నంతయు హస్తగతము చేసుకుని దానితోటి ముందుకు వెళ్ళుతున్నాము అనుకునేవారు మానవులలో మూడురకాలు ఉన్నారు. మొదటి తరగతివారు, అధికారము రాజకీయం హస్తగతం చేసుకుని, దానిని అంటిపెట్టుకుని తమయొక్క ప్రయోజనంకొరకు పాటుబడేవారు కొందరు. రెండవ తరగతివారు — ఏదో కొంతవరకు చదువుకుని ఉద్యోగాలతో కాలక్షేపము చేసుకునేవారు కొందరు, ఇక మూడవ తరగతివారు ఏదో డబ్బు సంపాదించుకుని ఏదోవిధముగ కాలక్షేపము చేసుకుంటూ జీవితము గడుపుకునేవారు కొందరు ఉన్నారు. ఈ విధముగ ప్రజానీకములో ఈ మూడు తరగతులవారు కన్పిస్తున్నారు. ఈ తెగలో ఈ విషయాలను గురించి ఆలోచించవచ్చు. అది ఆలోచించటానికి మనము ఎవ్వరము? మనకేమి అధికార మున్నది? డాక్టరు చెన్నారెడ్డిగారు కుర్రవాళ్ళకే అధికారము ఇవ్వమని అన్నారు. వాళ్ళకుకూడ representation ఇవ్వాలని అన్నారు. ఆయన మంచి సలహాయే యిచ్చారు. ఎవరైతే చదువుకోవాలో, అందులోకి ఎవరికైతే రావాలని ఆశ ఉంటుదో, వారికే స్థానము ఇవ్వాలని అన్నారు. మిఠాయి దుకాణముమీద కూర్చున్నవాడికి ఆ మిఠాయి అంతా

వాడికే యిస్తే, యిక మిరాయి కొనుక్కోటానికి అవసరమే ఉండదు గదా! అదేవిధముగ యువకులకు వారి వారి ప్రవృత్తులను (capacities) తల్లితండ్రులు కనిపెట్టి, వారికి ఉపయోగ పడేటటువంటి విద్య చెప్పించాలి. ఈ సందర్భములో నాకు ఒక ఉదాహరణ జ్ఞాపకము వస్తున్నది. రాజమండ్రిలో దామెర్ల రామారావుగారు అని ఉన్నారు. ఆయన తమ్మునికి ఎన్నో సంవత్సరాలు చదువు చెప్పించారు కాని చదువు రాలేదు. ఒకసారి వీణ వాయించడము కనిపెట్టారు. ఎవరు ఈ అబ్బాయి అంటే రామారావుగారి తమ్ముడు అని అన్నారు. ఒక రోజున బొమ్మలు వ్రాస్తున్నాడు దానిని చూచి అందులో పైకి వస్తాడని ఆలోచించి, చదువు మాన్పించి, చిత్రలేఖనము అభ్యాసము చేయటానికి ప్రవేశపెట్టాడు. అది బాగా నేర్చుకొని బాగా పైకివచ్చాడు. ప్రపంచములో యెంతో ప్రఖ్యాతి గాంచాడు. అదే విధముగ తల్లితండ్రులు తమ తమ పిల్లల ప్రవృత్తులు కనిపెట్టి, వాటి ప్రకారము ఆ విద్యలో ప్రవేశపెట్టితే పైకి వస్తారు. వాళ్ళ యొక్క మనస్తత్వము కనిపెట్టి, కేవలం వాళ్ల యొక్క బ్రతుకుతెరువు కొరకే అని ప్రధానముగా చూడకుండా, ప్రపంచములో మానవజాతికి విజ్ఞానము కలుగజేయటానికి, ప్రపంచములోని మానవజాతిని ఉద్ధరించటానికికూడ ఉపయోగపడేవిద్య నేర్పించాలి. ఆవిధముగ చేస్తే అలాంటి యువకులు ప్రపంచములో ఇతర రంగములలోకూడ ఉపయోగిస్తారని అందువల్ల యువకుల ప్రవృత్తులు ఏవిధముగా ఉంటాయో అవి కనిపెట్టి ఆ రంగమునకు సంబంధించిన విద్యను నేర్పించాలని నా అభిప్రాయము. ఇందాక గోపిడి గంగారెడ్డిగారు మాట్లాడుతూ ఈ రోజులలో విద్యార్థులు పూర్వకాలములో మాదిరి లేరు. మేష్టర్లకే చదువుచెప్పేవారుగా తయారైనారని అన్నారు. అంటే ప్రహ్లాదుడు మాదిరిగా తయారైతే. మంచిదే. ఇక వాళ్ళకు చదువుచెప్పించ నక్కరనేలేదు అప్పుడు ఈ యూనివర్సిటీలు ఎందుకు? వాళ్ళు చదువుకొనకముందే యోగ్యులుగాఉండి, విద్యాప్రవీణులు, విజ్ఞానసంపన్నులుగా ఉంటే, వాళ్ళకు చదువు అక్కరలేదు, ఉపాధ్యాయులు అక్కరలేదు. ఏమీఅక్కరలేదు. కాబట్టి యువకుల విషయములో తలితండ్రులు ఆలోచించవలసివుంటుంది, అట్లా చేస్తేనే, వాళ్ళు బాగా విద్యనేర్చుకుని ప్రవీణులై ముందుకు వస్తారు. ప్రపంచములో అన్ని రంగములలోను ఉపయోగపడే అవకాశము ఉంటుంది. అందువల్ల ముఖ్యంగా పెద్దవాళ్లే యువకులను మంచిదారిలో పెట్టటానికి ఆలోచన చేయవలసివుంటుంది. ఇప్పుడు ఈ బిల్లు యువకులను ముందుకు తీసుకొనిరావటానికి ఎంతవరకు ఉపయోగిస్తుందంటే విద్యావేత్తలు అందరు కలసి ఆలోచించాలి. నిజానికి యిది ఆచరణలోనికి వచ్చేటప్పటికి ఏ విధముగ

ఫలించగలదో నేను చెప్పలేను. కాని మామూలుగా ఇది అమలులోనికి వచ్చే టప్పటికి ఇంకా కొన్ని సంవత్సరాలు పట్టుతుంది. కనీసము ఒకటి, ఒకటిన్నర సంవత్సరములయినా పట్టుతుంది. దీనిని సెలెక్టు కమిటీవారు పరిశీలించాలి. వారు పంపే రిపోర్టును ప్రభుత్వం పరిశీలించాలి. ఆ తరువాత బిల్లు యిక్కడికి వచ్చి, ప్యాసుకావాలి. ఇది అంతా జరిగి ఆచరణలోకి వచ్చేటప్పటికి అంతవర కైనా పట్టుతుంది. ఇప్పుడు ఈ ఎసెంబ్లీలోని గ్రూప్సుఅన్నీ చూస్తే, ఇది ఆచరణ లోకి వచ్చేటప్పటికి ఆ రోజున ఎవరు ఉంటారో, ఎవరు ఏమి అవుతారో, ఏమి జరగవలసి వున్నదో ఎవరు చెప్పగలరు? కాబట్టి దీనిని గురించి ఖచ్చితమైన ఆలోచన చేసి సభ్యులందరు వేరే ఉద్దేశ్యము పెట్టుకోకుండా ప్యాసు చేయాలని అంటున్నాను. ఇందాక ఒక గౌరవ సభ్యుడు ఒక విషయము చెప్పారు. ఏమిటంటే కేరళలో మేము ఈ విధముగా చేశాము. సరే మీరుకూడ ఆ విధ ముగ చేస్తే ఎలాగు అని అంటారేమోనని అన్నారు. కేరళలో ఒక విధా నము, ఇక్కడ మరొక విధానము కావచ్చు. అయినా వారు సమర్థులు. అక్కడ విధానమును గురించి మనము ఇప్పుడు ఏమీచెప్పలేము. అదేవిధానము మనము కూడ అవలంబించకుండా, ఈ విధానాలలో అనుభవముమీద ఏది మంచిది అయితే ఆ విధానము మనము అవలంబిస్తే బాగావుంటుంది. అధ్యక్షుల వారు టైము అయిపోయిందని అంటున్నారు గనుక నేను ఇంతటితో ముగిస్తున్నాను.

మిస్టర్ ఛైర్మన్: ఇంతటితో ఈ దినపు సమావేశము రేపు ఉదయము 8-30 గంటల వరకు వాయిదా వేస్తున్నాను.

*The House then adjourned till Half Past Eight of the Clock on Friday, the 4th July 1958.*